

# గోరా

జననం :

2 నవంబరు 1902

మరణం :

26 జూలై 1975

NENU NAASTIKUNNI
By Gora

*First Published*
**May, 1976.**



*Price :*
***Rs. 2-50***

*Printed at*
SANTHI PRINTERS
Vijayawada- 2.

# విషయ సూచిక

వాదంలో ఒకభాగంగానో మాత్రమే చూచేవారికి నాస్తికత్వం సంపూర్ణ రూపం అర్థంకాకపోవచ్చు. నాస్తికత్వాన్ని నూతనజీవిత విధానంగా స్వీకరించినప్పుడే కేవలం తాత్వికచర్చేకాక, నాస్తికత్వం అంటే నిత్య జీవితంలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక సాంకేతిక రంగాలలోకూడా నూతనదృష్టి, దానిననుసరించి ఆచరణ అని సుబోధం కాగలదు.

మానవజీవితాన్నీ, చుట్టూవున్న చరాచర ప్రకృతినీ సృష్టించి, నడిపించే ఏదోఒక శక్తి వుంది అని బానిసభావమును పెంచుకుని, అట్టి బానిస ప్రవృత్తితో నిర్మించుకున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక, వైజ్ఞానిక, సాంకేతిక వ్యవస్థలకు, కార్యాచరణకు – ఇందుకు భిన్నంగా అటువంటి మూలమైన శక్తి ఏమీలేదనీ, మానవునికి స్వాతంత్ర్యం వున్న దని భావించే, ఆలోచనకు, ఆచరణకు, మార్పుకు ఈ విధానములో నిర్మించుకునే జీవితంలో వివిధ రంగాలకు, కార్యక్రమాలకు తప్పని సరిగా తేడా వుంటుంది. ఆస్తికజీవిత విధానం పరాధీనమై భయంవల్ల భారమై, మార్పుచేసికొనుటకు మానవునికి స్వేచ్ఛ లేని గుదిబండ కాగా, నాస్తిక జీవితవిధానం వాస్తవ దృక్పథాన్ని,వ్యక్తిస్వేచ్ఛను సంఘదృష్టినీ కలిపి, నిర్భయంగా సాంఘిక ఆర్థిక సమానత్వాలను సాధిస్తూ, ప్రజలందరిలో సుఖసంతోషాలను పెంచే చైతన్యస్రవంతిగా వుంటుంది. గతముయెడల పరిశీలనా దృష్టి, వర్తమానములో పట్టుదలతోకూడిన కృషి, భవిష్యత్తు యెడల స్వాభిమానము. సహకారముతో కూడినటువంటి ఆశ, నాస్తిక విధానములో స్పష్టంగా కనిపిస్తాయి. అందుచేతనే "నేను నాస్తికుణ్ణి" అని అనుకోగానే జీవితముయెడల నూతనదృక్పథం ఏర్పడుతుంది. జీవితముయెడల నూతన దృక్పథం ఏర్పడకపోతే నాస్తికత్వము ఒక

జీవిత విధానముగా, నిర్మాణాత్మకంగా రూపొందక విషేధాత్మకంగానూ, పాక్షిక సంస్కరణ వాదంగానూ వుండిపోతుంది.

1950-51 సంవత్సరాలలో అప్పుడు నడిపిన నాస్తిక వారపత్రిక "సంఘం"లో గోరాగారు వ్రాసిన ఎన్నో వ్యాసాలలో- "నేను నాస్తికుణ్ణి" అనే వ్యాససంపుటి ఒకటి. ఈవ్యాససంపుటిలో ఎన్నో విషయాలను ప్రథమ పురుషలో వివరించి, చర్చించారు. 47 వ్యాసాలుగా దీనిని అప్పుడు ప్రచు రించారు. వీటిని ఇక్కడ పుస్తకరూపంగా మీముందు వుంచడం జరుగు తోంది. ఆ రోజులలో "రేషనింగు" వుంటూ ఉండటంచేత "ఆహార కొరత" అనే వ్యాసంలో ఆహారపంపిణీ విషయంలో "రేషనింగు" సక్రమంగానూ, పటిష్టంగానూ జరగాలని గోరాగారు సూచించారు ఈ ఒక్క ఉదాహరణ మినహాయిస్తే, ఈ వ్యాససంపుటిలో సామయిక చర్చ లేదు. నాస్తికదృష్టితో వివిధరంగాలను అర్థంచేసికొనుటకు ఈనాటికీకూడా ఒక చక్కటి సాధనంగా ఇది మనకు కనపడుతుంది ఈ వ్యాస పరంపరను కొనసాగిచివుంటే ఇంకా ఎన్నోవిషయాలు గోరా చర్చించి వుండేవారు. కాని ఇందులో వచ్చినంతవరకు విషయాలు స్పష్టంగానే తెలియ చెప్ప బడ్డాయి.

"చదువుకున్నవారి స్వాతిశయము" అనే వ్యాసంలో చెప్పినట్లుగా సామాన్యులకు నాస్తికత్వం అర్థం అవుతుందా అని ప్రశ్నించేవారు ఇప్ప టికీ వుంటారు, కాని నాస్తికత్వం ప్రత్యక్షజీవితంతో సంబంధం కలది కనుక తర్కంలోని కౌశల్యంకంటే ప్రత్యక్షప్రమాణంవల్ల సత్యం నిరూ పితం అవుతుంది. సత్యనిర్ధారణకు ప్రత్యక్ష ప్రమాణం ప్రబలసాధనం అయినప్పుడు విద్యాధికులనుకునే వారి తర్క-వితర్క కుతర్కాలకంటే

సామాన్యుల నిజాయితీతో కూడిన లోకజ్ఞానం ఎక్కువ ఫలవంతం అవుతుంది. చనిపోయిన చేప జీవుడులేని కారణాన "నీటిలో మునుగుతుందా, తేలుతుందా?" అనే సిద్ధాంతచర్చ చేసుకుంటూ కూర్చునే పండితులకంటే, ఒక చనిపోయిన చేపను తీసికొని వచ్చి నీరున్నకుండలో వేసి, మునుగుతుందో, తేలుతుందో ప్రత్యక్షంగా నిర్ధారణచేసికునే సామాన్యుని గ్రహణశక్తి, పరిశీలన ఉన్నతమైనవి కావా? తన దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని, మౌఢ్యాన్ని బాపుకుని అసమానతల విషచక్రంలోనుంచి, దోపిడీనుంచి బయటపడి సుఖసంతోషాలతో జీవితం గడపాలనుకునే సామాన్యుడు నాస్తికత్వాన్ని తేలికగానే అర్థంచేసుకోగలుగుతాడు.

అందుచేత ప్రతిఒక్కరం గోరాతోపాటు "నేను నాస్తికుణ్ణి" అనుకుందాం. ఈ పుస్తకం కరదీపిక కాగా జీవితాన్ని పరిశీలించుకుందాం, మార్చుకుందాం.

గోరా సాహిత్యాన్ని ప్రచురించుటకు వివిధవిధాల ప్రోత్సహించి, సహకరిస్తున్న మిత్రులకు, అభిమానులకు మా కృతజ్ఞతలు.

నాస్తికకేంద్రం
విజయవాడ
20-5-76

లవణం

# దైవ విశ్వాసమా ? ఆత్మ విశ్వాసమా ?

నేను నాస్తికుణ్ణి. నా జీవితానికి ఇతరుల జీవితానికి తేడా ఏమిటి? తేడా లేనప్పుడు ఏ పేరు పెట్టుకుంటేనేం? వేరు వేరు సిద్ధాంతాల పేర్లు పెట్టుకొని తగాయిదాలు తెచ్చుకోవడానికేనా? వాదోపవాదాల కోసమేనా? అలాగ కాకపోతే నాస్తికత్వం వలన నా జీవితం ఎలా మారింది? ఇంకా సౌఖ్యవంతంగా ఎలా వుంటుంది? నాస్తిక దృక్పథం వలన నా విజ్ఞానం, నా ప్రవర్తనలో ఏం మార్పులు వచ్చాయి?

అన్నిటికంటే ముందు ఒక ప్రశ్న ఉంది. నేను ఆస్తిక సాంప్రదాయంతో పెరిగిన వాడినే. మా అమ్మా, నాన్నగారి శిక్షణవల్ల, నా చుట్టూ వున్న వాతావరణంవల్ల, నాకూ దేవుడిలో చాలా నమ్మకం వుండేది. ఇప్పుడు ఆ నమ్మకాన్ని ఎందుకు వదిలిపెట్టవలసి వచ్చింది?

ఒక ఆలోచన నన్ను నాస్తికునిగా మార్చింది. నిత్యజీవితంలో నా పని నేను చేసుకుంటూ వుంటే నాకు దేవుడు ఎందుకు? నా పనులు దైవాధీనం అయితే, నేను కష్టపడి కృషి చేయడం ఎందుకు? నేను ప్రయత్నం చేస్తే దాని ఫలితం దైవం ఇస్తుందట. ఇది నాకు అవకతవకగా కనబడింది. ఒక ఫలితం కావాలనీ, వస్తుందనీ ఆశించి నేను చేసే ప్రయత్నానికే అర్థం వుంటుంది. ఉదాహరణకు నేను పరీక్షకు వెళతాను, నా కృషి వలన నేను ప్యాసు అవుతానని ఆశ నాకు వుంటేనే నేను శ్రద్ధగా చదువుతాను, నేను ఎంత చదివినా ఫలితం దైవాధీనం అంటే, నాకు ఆ పని బాధ్యతారహితంగా ఉంటుంది. ఇది దైవ విశ్వాసంతో వచ్చే లోపము. అది సరిదిద్దాలంటే దైవవిశ్వాసాన్ని నేను వదిలివేయాలి. అప్పుడు ప్రయ

త్నమూ నాదే, ఫలితమూ నాదే. ఇదీ నా స్తికదృష్టి. నాప్రవర్తన బాధ్యతా యుతంగా వుంటుంది. నాపనులకు నేనే బాధ్యత తీసుకోవాలంటే, నాకు దైవవిశ్వాసం అనవసరం. అనవసరమే కాదు; నా కృషికి అడ్డు పడు తున్నది కూడా. అందుచేత దైవవిశ్వాసాన్ని నేను వదిలిపెట్టాను.

నాస్తికత్వం అంటే దైవవిశ్వాసాన్ని వదిలిపెట్టడమే అని సాధారణంగా అంటారు. నేనూ మొదట అలాగే అనుకున్నాను. కాని అది నాస్తికత్వానికి సంపూర్ణమైన నిర్వచనం కాదు. నిజానికి నాస్తికత్వం అంటే సంపూర్ణ ఆత్మ విశ్వాసం. ఆత్మవిశ్వాస వికాసానికి దైవనమ్మిక అడ్డుపడు తున్నది. కాబట్టి దైవవిశ్వాసాన్ని తొలగించాలి.

నేను బాధ్యతాయుతంగాను, కార్యదక్షతతోనూ జీవించాలంటే నేను నాస్తికుణ్ణి అయితీరాలి. నాస్తికుణ్ణి అవగానే మానవజీవితంలో వివిధ విషయాలపట్ల నా దృషి, నా ప్రవర్తన ఎలా మారాయి ?

## విరామమెరుగని ఆశా విప్లవమే నాస్తికత్వం

నాలో నాస్తిక దృక్పథం ఏర్పడగానే ఒక మార్పు వచ్చింది. నాకు పనిలో పట్టుదల పెరిగింది. ప్రతిపనీ బాధ్యతాయుతంగాచేయడం మొదలు పెట్టాను నా కృషికి ఏదీ అడ్డులేదు. అపరిమితమైన శక్తి వచ్చింది. అయితే నేను చేసే ప్రతీ పనికీ నేను అనుకున్న ఫలితంగాని, నేను అనుకున్నంత ఫలితం గాని రాకపోవచ్చు. ఒక్కొక్కప్పుడు నేను అనుకున్న దానికికొంత వ్యతిరేకంగాకూడా జరగవచ్చు. కాని వాటివల్ల నాకుఆశాభంగం

కలిగే బదులు మరింత ఉత్సాహం పెరిగింది. ఎందుకంటే ప్రపంచం అంతటిలోనూ వున్నది నేను ఒక్కడినే కాదు. నావంటివారే ఇంకా చాలా మంది ఉన్నారు. చెట్లు, చేమ వున్నాయి; గట్టు, పుట్ట వున్నాయి; జంతు జాలాలున్నాయి. గాలి, వాన ఉన్నాయి. వీటన్నిటికీ వాటివాటి నడతలు, లక్షణాలు వున్నాయి. ఇన్నింటి మధ్య నేను పని చెయ్యాలి.

నా చుట్టూ వున్న వ్యక్తులలోను, పరిస్థితులలోను కొన్ని నాకు అనుకూలంగానూ వుండవచ్చు, కొన్ని నాకు ప్రతికూలంగానూ వుండవచ్చు. అయితే నా ప్రయత్నం వల్ల ప్రతికూలతను నావైపుకు త్రిప్పుకోవాలి. అనుకూల పరిస్థితులు, ప్రతికూల పరిస్థితులు, నా ప్రయత్నము ఇవన్నీ కలసి ఫలితం వస్తుంది. ఈ మూడు రకాలలోను నా చేతిలో వున్నది నా ప్రయత్నం. నా ప్రయత్నాన్ని నేను పెంచుకుంటాను. నాకు ప్రతికూలంగా వున్నవాటిని మరల్చుకొంటాను; అనుకూలంగా వున్న వాటిని అనుసరిస్తాను. నా ప్రయత్నం ఎంత హెచ్చయితే ఫలితం నాకంత అనుకూలంగా వుంటుంది. అనుకున్న దానికన్న ఫలితం తక్కువ అయితే నాకు ఆశాభంగం ఎందుకు? ఇదివరలో నాకు తెలియని ప్రతికూలతలు, ఇప్పుడు బయట పడవచ్చు. దానివల్ల నాఅనుభవం హెచ్చుతుంది అందుచేత నేను నాస్తికుణ్ణి అవగానే నాకృషి పెరిగింది. నాఅనుభవం పెరుగుతున్నది. ప్రతి విషయంలోనూ చైతన్యయుతంగా ప్రవర్తిస్తున్నాను.

దేవునిలో నమ్మిక వున్నంతకాలం నాపనుల ఫలితభారం దేవునిమీద పడవేశాను. అందులో వ్యతిరేకతలువస్తే "నేనొకటి తలిస్తే దేవుడొకటి తలచాడు" అనో, "నా కర్మ", "నా గ్రహచారం" అనో ఊరుకునేవాణ్ణి. ఇటువంటి నమ్మకము వలన నాకు ఒక చవకబారు సంతృప్తి వచ్చింది.

కాని దాని వల్ల నా అనుభవం పెరగలేదు. నా కృషికి చురుకుదనం రాలేదు మొదటిసారి పొరపాటు, రెండవసారి గ్రహపాటు, మూడవసారి అల వాటులాగా చేసిన పనులే చేస్తూ, ఎప్పటికప్పుడు దైవాన్ని నిందిస్తూ, కాళ్ళు చాపుకొని కూర్చోవడం అయింది. అలా కూర్చోవడం మాంద్యము ను పెంచేదేగాని, అందులో అభివృద్ధి లేదు. దాని శాంతి స్మశాన శాంతి, దాని సౌఖ్యం ఆత్మహత్యలోని సౌఖ్యం.

నేను నాస్తికుణ్ణి అవగానే ఆ స్తబ్దత పోయింది. జీవితమందు శ్రద్ధ పెరిగింది, పనుల యందు బాధ్యత పెరిగింది. క్షణక్షణము చేస్తున్న పని గురించి ఆలోచించడం అధికమయింది. వీటితో ఆదర్శం, సంతోషం అభివృద్ధి చెందాయి. ఇటువంటి నూతన చైతన్యం కలగడానికి చదువు అవసరము లేదు. సాధన అవసరము లేదు. నాస్తికుణ్ణి అవగానే నాలో ఈ మార్పులన్నీ వచ్చాయి. నేనేకాదు అజ్ఞానంలోను, అంధకారంలోను అణగి పడివున్న సామాన్య హరిజనులు ఈ నాస్తిక దృక్పథాన్ని అవలం బించగానే వారిలోనూ ఈ మార్పు వచ్చింది. పెద్దపెద్ద పండితులు ఆశా భంగాలవల్ల అణగిపోతూ ఉండవచ్చును గాని, నాస్తికుడు నవ్వుతూ ముందుకు నడచి పోతుంటాడు. నాస్తికుని అనుభవము, ఆశ పెరుగుతూ ఉంటుంది. దైవ విశ్వాసం వదలి పెట్టగానే సంకెళ్ళు విడిపోయినట్లయి స్వేచ్ఛావాయువును పీల్చుకున్నాను.

## సంఘం సంపూర్ణ వ్యక్తిత్వంలో ఒక భాగం

నాస్తిక దృష్టితో చూస్తే సంఘం, ప్రభుత్వం, విజ్ఞానం, నైతికం ఈ మాటలకు క్రొత్త అర్థాలు వచ్చాయి. ఇదివరలో ప్రభుత్వం అంటే నాపైన పెత్తనం చేసే సంస్థగా కనిపించింది. సంఘం అనగానే నాకంటే

[illegible] నాతో లొంగుబాటు, [illegible] [illegible] నా ప్రయత్నం వల్ల లాభం [illegible] అనుకున్నాను. లాభం [illegible] ఏమిటి? అందుచేత స్వయంకృషి [illegible] కొట్టుకు పోయేవాడిని. "ఎందుకు?" అని [illegible] అడగలేదు. ఆలోచన అనవసరం అనిపించింది. చేత [illegible] చేసుకున్నట్లు, నాకు వచ్చే కష్టనష్టాలకు సంఘాన్ని, ప్రభుత్వాన్ని నిందించేవాడిని. విసుగుకునే వాడిని. సంఘం, ప్రభుత్వం నాకంటే పెద్దవి అనుకుంటున్నంత కాలము, ఎంత చిరాకు పడితే ఏం కార్యం? వాటిపైన గోటిగీతైనా పడలేదు. ఆ సంఘాచారాలు అలాగే వుండేవి. వాటి ప్రవాహంలో పడిపోయే వాడిని, నాలో వేరే వికాసం లేదు.

నా మానసిక దృష్టి మారగానే సంఘానికి, నాకు వున్న సంబంధం యొక్క అర్థం మారింది. సంఘంలో నేను ఒక భాగాన్ని కాదు; సంఘం నాలో ఒక భాగం అని గ్రహించాను. అది ఎలాగ?

సంఘం అంటే ఏమిటి? పదిమంది కూడి వుంటే సంఘం అవదు. కూడి వుంటే అది సమూహం అవుతుంది. ఆవులు మందగా వుంటే అది ఆవుల సమూహం. ఆవుల సంఘం కాదు. సంఘం అంటే వ్యక్తులమధ్య ఏకీభావం ఉండాలి. కొందరు కలసి ఒక పని నెరవేర్చడానికి తీర్మానించుకుంటారు. ఆ నిశ్చయం మీద వారందరికీ ఏకీభావం ఉంటుంది. ఒకే దృష్టితో ఆ పనికి పూనుకుంటారు, వారి కృషి ఫలితంగా అది నెగ్గే అవకాశాలు హెచ్చవుతాయి. దాని వలన వచ్చిన ఫలితాన్ని వారందరూ అనుభవిస్తారు. ఇట్టి ఏకీభావం సంఘానికి ముఖ్యలక్షణం.

ఏకీభావానికి అందరూ కలిసి వుండ నవసరం లేదు కూడాను, దేశంలో ఈ మూల ఒకరు, ఆ మూల ఒకరు; ఈ దేశంలో కొంతమంది, ఆదేశంలో కొంతమంది ఏదో విషయంమీద ఏకీభవించవచ్చు. వారు ఎప్పుడూ కూడకపోవచ్చు. కాని ఏకీభావం వలన వారందరి కృషి ఆ విష యానికి సంబంధించినంతవరకు ఏకోన్ముఖంగా వుంటుంది. అందుచేత వారు ఇండియాలో వున్నా, ఇంగ్లాండులో వున్నా, అమెరికాలో వున్నా, ఆఫ్రికాలో వున్నా, వారు ఎన్నడైనా కూడినా, కూడకపోయినా వారందరూ ఒక సంఘంగా వుంటారు. దీనిక వారి ఏకీభావం ముఖ్యం. ఇట్లు సంఘం అంటే ఏకీభావం.

సంఘం అంటే ఏకీభావం కనుక నాకూ సంఘానికి సంబంధం ఏమిటి? నాలో తొంభై కోరికలూ, లక్షణాలూ ఉన్నాయి. వాటిలో నాలు గింటి వరకే ఇతరులూ, నేనూ ఏకీభవించాం. అంతవరకే నాకూ, ఇతరు లకూ సంబంధం. తక్కిన ఎనభైఆరు కోరికలూ నా వ్యక్తిత్వానికి సంబం ధించి వుంటాయి. అనగా నా సంపూర్ణమైన వ్యక్తిత్వంలో కొంత భాగము వరకే సంఘ ఏకీభావానికి నేను అంగీకరించాను. అలాగే ప్రతివాని వ్యక్తి త్వంలోనూ కొంతభాగం చేరి సంఘం అయింది, ఇట్లు సంఘం అనగా సంపూర్ణ వ్యక్తిత్వంలో ఒక భాగం. ఇతరులతో ఏకీభావం పెరుగుతున్న కొద్దీ ఈ భాగము పెరుగుతుంది. ఏకీభావము తగ్గుతున్న కొద్దీ ఈ భాగము తగ్గుతుంది,

ఇట్లు సంఘం నాలో ఒక భాగం అని నాకు తెలియగానే సంఘానికి నాకు వున్న సంబంధానికి వేరే రూపము వచ్చింది. నాకు ఎంతో స్వాతం త్ర్యం, బాధ్యత వచ్చాయి. సంఘమర్యాదలను గౌరవించే బాధ్యత నాది. సంఘం తప్పుదారిన పోతున్న దనుకుంటే నా వ్యక్తిత్వాన్ని వినియో

గించి దానిని నేను సరిదిద్దుకోవాలి. సంఘం నాకన్నా పెద్దదనీ, దానికి నేను లొంగి వుండాలని అనుకున్నంత కాలము నేను నిస్పృహలో పడియున్నాను. ఇప్పుడు నిస్పృహ పోయి ఉత్సాహం వచ్చింది. సంఘానికి ఒక దానివను కాను సంఘాన్ని నిలిపే ఒక సద్వ్యక్తిని. సంఘం ఉనికి నా సహకారం మీద ఆధారపడి ఉంది. ఇట్టి నాస్తిక దృష్టి రాగానే ప్రభుత్వం, నీతి, విజ్ఞానం గురించి ఇదివరలో ఉన్న అభిప్రాయాలు మారాయి.

## సమస్త శాసనకర్త మానవుడు

సంఘం నాలో ఒక భాగం అయినప్పుడు ప్రభుత్వం నా కంటె మించి ఎలా వుంటుంది?

సంఘం అంటే వ్యక్తినీ, వ్యక్తినీ కలిపే సంబంధం. సంఘంలో ఏకీభవించే వ్యక్తుల సంఖ్య పెరుగుతున్న కొద్దీ, వ్యవహారాల సౌకర్యం కొరకు ఒక కార్యనిర్వాహక వర్గాన్ని నియమించుకుంటాం. దేశ జనాభా అంతా సమిష్టి సౌఖ్యం కొరకు చేరితే, వారి కార్యనిర్వాహక వర్గమే ప్రభుత్వము. సంఘం నాలో ఒక భాగం కనుక, దాని కార్యవర్గం అయిన ప్రభుత్వం కూడా తప్పక నాలో ఒక భాగమే. అందుచేత ప్రభుత్వం నాకు లోబడి ఉంది. నేడు ఇతరులతో ఏకీభవించి వున్న కార్యకలాపాలను ప్రభుత్వం నడపాలి.

ప్రభుత్వాధికారులు అనుకునేవారు యదార్థానికి అధికారులుకారు. వారు సేవకులు. ఈ సూత్రాన్ని అనుసరించే ప్రభుత్వోద్యోగస్తులు పౌరులకు ఉత్తరాలు రాసేప్పుడు "తమ సేవకుడు" అని సంతకంచేస్తారు. నిజానికి వారు సేవకులే. కాని ఈ రహస్యాన్ని గుర్తించక ప్రభుత్వో

ద్యోగస్తులు తమకు అధికారులని సామాన్యప్రజ ఈ నాటికీ అనుకుంటు న్నారు సేవకులు అధికారులుగా ఎంచబడటం ప్రజలదృష్టిలో తారు మారుగదా, ఇట్టి తారుమారుకు కారణం ఆస్తికదృష్టి.

ఆస్తికత్వం అంటే మానవునిలోని బానిసత్వము, బానిస ఎప్పుడూ దేనికో ఒకదానికి లొంగివుంటాడు, అందుకే ఆస్తికులు ఒక దేవుణ్ని కల్పించుకొని దానికి లొంగివుంటాడు. ఆస్తిక విశ్వాసంలో గర్భితమైవున్న ఈ బానిసప్రవర్తనే వారిజీవితం అంతటిలోనూ కనపడుతూ ఉంటుంది. సంఘానికి లొంగివుంటారు. ప్రభుత్వానికి లొంగివుంటారు, ఎక్కడ పడితే అక్కడ లొంగిపోయి బానిసలుగా వుండటమే ఆస్తికత్వంలక్షణము ఆస్తికుల సంఘసంబంధాలలో సహకారంకంటే లొంగుబాటే అధికంగా వుంటుంది. ఈ లొంగుబాటే ఆస్తికుల రాజకీయ సంబంధాలలో కూడా ప్రకటితమవుతుంది. అందుచేత తమ సేవకులైన ప్రభుత్వోద్యోగస్తుల్ని తమ అధికారులుగా ఆస్తికులు తయారు చేసుకుంటారు. ఆ అధికారులకు లొంగి వుంటారు. సేవకులు అధికారులుగా తారుమారు అవడానికి కారణం ఆస్తికుల బానిసభావం,

ఒక దేవుడినో, ఒక కర్మ సిద్ధాంతాన్నో కల్పించుకొని, దానిని నెత్తిమీద ఎక్కించుకున్నట్లే, ఆస్తికులు ప్రభుత్వాన్ని తమపై పెత్తనం చేసే సంస్థగా చూచుకుంటారు. అందుచేత ప్రజల సహకారంతో ఏర్పడవలసిన ప్రజాస్వామి కాలను ఆస్తికులు నియంతృత్వాలుగా మార్చి వేస్తారు, ఆ నియంతల పాదసేవచేస్తూ వుంటారు, ఇది ఆస్తికుల లక్షణం అందుచేత ప్రజానీకంలో ఆస్తిక సాంప్రదాయం వున్నంతకాలం ప్రజా స్వామికము నడవదు. ప్రభుత్వము పేరుకు ప్రజాస్వామికం అయినా

ఆచరణలో ఏదో ఒక రకమైన నియంతృత్వము అయిపోతుంది.

ప్రభుత్వం ప్రజాస్వామికంగా ఉండాలంటే నాస్తికత్వం కావాలి. నాస్తికత్వము అంటే మానవునిలోని స్వాతంత్ర్యం. స్వతంత్రులే సంఘ సంబంధాలలో సహకరించగలరు. బానిసలకు సహకారం, పరస్పర గౌరవం చేతగాదు. వాళ్ళు ఎంతసేపూ ఒకరికి లొంగివుంటారు. ఇతరుల పాదాలకు మ్రొక్కుతూ వుంటారు, అది దేవుడైనా సరే, ప్రభుత్వం అయినా సరే.

రకరకాల ప్రత్యేక అవకాశాల వలన కొందరికి హెచ్చు, కొందరికి తక్కువ జీవిత సౌకర్యాలు ఈనాడు ఉన్నాయి. సంఘంలో ఒకరిని ఒకరు గౌరవించుకుంటూ, సహకరించుకుంటూ ఉంటే ఈ హెచ్చు తగ్గులను సవరించుకొని సమానత్వము ఏర్పరుచుకుంటారు. నాస్తిక దృక్పథం వస్తేనే ఇది సాధ్యపడుతుంది. ఆస్తికులు బానిసభావం కలవారు కనుక సమానత వారికి చేతకాదు. ఎక్కువ తక్కువలు వుంటాయి.

ఆస్తిక సాంప్రదాయంలో మామూలుగా అందరూ బానిసలు అయినా హెచ్చు తక్కువ అవకాశాలవలన, ఎక్కువ తక్కువగా వుంటారు. అందుచేత ఆస్తికులలో ప్రతివాడు తనకంటె హెచ్చుగా వున్న వాడికి బానిసభావంతో సాష్టాంగ నమస్కారం చేస్తాడు. తనకంటె తక్కువ అవకాశాలువుండి తనకు మ్రొక్కువాడిని కాళ్ళతో తన్నుతాడు. ఇందుకు హిందువులలోని కులతత్వం ఒక వుదాహరణ. ఎక్కువ కులం వానికి నమస్కరిస్తారు; తక్కువ కులం వారిని తన్నుతారు. ప్రతివాడూ ఒకరికి నియంత, ఇంకొకరికి బానిస. అందితే జుట్టు. లేకపోతే కాళ్ళు. ఇదీ ఆస్తికుల లక్షణం.

సంఘ సమానత్వం కావాలంటే నాస్తికత్వం కావాలి. నాస్తికుడు అయితే ప్రభుత్వాన్ని తనలో ఒక భాగంగా గుర్తిస్తాడు. ప్రభుత్వాన్ని

నడుపుతాడు. తాను సౌఖ్యం పొందుతాడు. ఇదీ ప్రజాస్వామికం. నాస్తికుడు అయితేనే ప్రజాస్వామికం అర్థం తెలుస్తుంది. ప్రజాస్వామిక విధానం ఆచరణలో వుంటుంది. లేకపోతే ఆస్తిక సాంప్రదాయంలోని ప్రభుత్వము పేరుకు ప్రజాస్వామికం అయినా, నడక నియంతృత్వమే.

## చెప్పింది చేయడం; చేసింది చెప్పడం ఇదే "సత్యం" – ఆదే "నీతి"

సంఘం నాలో ఒక భాగం. సంఘాన్ని పోషించుకునే బాధ్యత నాది. ఈ బాధ్యతను పూనగానే నా ప్రవర్తనలో ఒక మార్పు వచ్చింది. నా ప్రవర్తన నీతివంతం అయింది.

నీతి అంటే ఏమిటి ?

ఇతరులతో ఏసంబంధం లేకుండా నేను ఒక్కడినీ జీవిస్తూ వుంటే, నా ప్రవర్తనకూ, నా సౌఖ్యానికే సంబంధం వుండేది. ఉదాహరణకు రుచిగా వుందికదా అని ఏ వస్తువునైనా నిన్న విస్తారంగా భుజించానను కుందాం. ఈరోజు కడుపునొప్పి వస్తుంది. అసౌఖ్యం కలుగుతుంది. అందు చేత ఈరోజు నేను కష్టపడకూడదంటే నిన్నటి నా ప్రవర్తనలో నేను జాగ్రత్తగా ఉండాలి. అలాగే రేపు నాకు కష్టం కలగకూడదనుకుంటే ఈరోజు ప్రవర్తనలో నేను జాగ్రత్తగా వుండాలి. అనగా నిన్న, ఇవాళ రేపు అనే కాలవాహినిలో నా సౌఖ్యానికి ఒడుదుడుకులు ఉండరాదంటే, రుచిగల పదార్థాన్ని విస్తారం భుజించడం వంటి తాత్కాలిక ఆనందాన్ని ముందాలోచనతో కొంత త్యాగం చెయ్యాలి. ఇట్లు ఏ ప్రవర్తన వలన సౌఖ్యం ఎల్లప్పుడూ సరిసమానంగా వుంటూ వుంటుందో దానిని నీతి అంటాం.

పైన చెప్పిన నీతి వ్యక్తి నీతి. స్థూలంగా చూస్తే, మానవ సంఘం లోని నీతి అంతే. మానవ సంఘంలో పదిమందితో కలసి వ్యవహరిస్తూ వుంటాం. ఈ కలయికలో సామరస్యం వుండాలి. ఏరకపు ప్రవర్తన వలన సామరస్యం కలుగుతూ వుంటుందో దానిని నీతి అంటాం. నేను సంఘాన్ని పోషించాలి కనక, నేను ఎల్లప్పుడూ నీతివంతంగా వుండాలి.

సంఘం అవసరాలు మారుతున్న కొద్దీ, ప్రవర్తన రూపం మారుతూ ఉంటుంది. కాని ఎప్పుడు ఏది చేసినా, అది సంఘ సామరస్యా నికి తోడ్పడితేనే అది నీతి అవుతుంది,

ఉదాహరణకు పూర్వకాలంలో వారివారి నమ్మకాల వలన కుల కట్టుబాట్లు హిందూ సంఘంలో సామరస్యాన్ని చేకూర్చాయి. ఆరోజులో కులాల్లో ఎక్కువ తక్కువలు, అస్పృశ్యతా నీతి రీతులే ; కాని ఈనాడు పాత భావాలు మారిపోయాయి. కుల మర్యాదలూ, అస్పృశ్యత వల్ల సామరస్యం లేదు సరికదా, ఆ హెచ్చుతగ్గులు అవమానకరంగా కనపడు తున్నాయి. వాటిమీద తిరుగుబాటు చేస్తున్నారు. అందుచేత పూర్వపు రీతులు ఈనాడు నీతి వంతంగా లేవు. ఈ నాడు నీతి రీతులు సమానతను సాధించాలి. సమానత వలననే సంఘంలో సామరస్యం వస్తుంది.

రీతుల వివరాల్లో మార్పు వస్తున్నా. ఒక రకమైన సూత్రం ఎప్పుడూ సంఘంలో నీతివంతం గానే ఉంది. అది ఏమిటంటే, చెప్పినట్లు చేయుట, చేసినట్లు చెప్పుట. దీనినే "సత్యం" అనికూడా అంటారు. సం ఘంలో సత్యం స్థిరమైన నీతి. ఎందుకంటే, సంఘమనగా ఏకీభావము కదా. నేను చెప్పినట్లు చేస్తానని మీకు, మీరు చెప్పినట్లు చేస్తారని నాకూ నమ్మకం లేకపోతే, మన ఇద్దరి మధ్య ఏకీభావం వుండదు. అందుచేత ఏకీభావం కొరకు సత్య ప్రవర్తన అత్యవసరం. నాస్తికుడు సంఘాన్ని పోషించాలి కనక సత్య ప్రవర్తకుడై ఉండి తీరుతాడు.

సత్య ప్రవర్తనకు త్యాగం అవసరం అవుతూ ఉంటుంది. ఉదాహరణకు ఇవాళ మధ్యాహ్నం మూడు గంటలకు ఒక మిత్రుని వద్దకు వస్తానని చెప్పియున్నాను. ఆవేళకు ఎండ హెచ్చుగా వుండవచ్చు. నా శరీర సౌఖ్యాన్ని ఆశించి మూడు గంటలకు వెళ్ళుటకు బద్ధకం తోచవచ్చు. కాని నేను చెప్పినట్టు చేయవలెనంటే, నా శరీర సౌఖ్యాన్ని త్యాగంచేసి ఎండఅయినా వెళ్ళి, నేను చెప్పినట్లు చేయవలసిందే. సమాన సౌఖ్యం కొరకు రుచిగల పదార్థాన్ని విస్తారం తినుట ఎట్లు త్యాగం చేశానో అలాగే సంఘ బలం కొరకు నా శారీరిక సౌఖ్యాన్ని కొంత త్యాగం చేస్తూ వుండాలి. ఇది చిన్న ఉదాహరణ. కాని ప్రతి విషయంలోనూ మూల సూత్రం. ఇదే.

ఇట్లు సంఘాన్ని పోషించాలంటే, నా ప్రవర్తనలో నీతి, త్యాగం ప్రవేశిస్తాయి. అందుచేత నా స్తికుడు నీతివంతుడై తీరుతాడు.

ఆస్తికులు కూడా నీతిగురించి చెప్పుతారు కదా. దానికీ, దీనికీ తేడా ఏమిటో చూద్దాం.

## ఆస్తిక నీతి విధానం స్వార్థానికి దారితీసింది

నాలో ఆత్మ విశ్వాసం పెరగాలంటే నాకు నాస్తికత్వం అవసరమైనట్లే, నాలో నీతి పెరగాలన్నా నాస్తికత్వం అవసరమైంది. ఆస్తి కత్వం కూడా నీతి గురించే చెప్పుతోంది కదా, అటువంటప్పుడు నీతి పెరగడానికి నాస్తికత్వం ఎందుకు కావలసి వచ్చింది ?

నిజమే. ఆస్తికత్వం కూడ నీతిగురించి చెప్పుతుంది. చెప్పితీరాలి కూడాను. ఎందుకంటే, ఆస్తికత్వమైనా. నాస్తికత్వమైనా అవి మానవ జీవితానికి సంబంధించి వుండాలి. మానవుడు వ్యక్తిగతంగా జీవించాలన్నా, తన సౌఖ్యం సమముగా ఉంచుకొనుటకు తన ప్రవర్తనలో నీతి ఉండాలని చూచాం. అది వ్యక్తిగత నీతి. అట్టి వ్యక్తిగత జీవితం ఈ

కోణాన అరుదు, దుర్లభం కూడాను. ఎక్కడో ఏమూలో ఒంటరిగా సంచరిస్తున్న అడవి మనుషులవో, లేక ముక్కు మూసుకుని కొండ గుహల్లో కూర్చున్న ఋషులవో వ్యక్తిగత జీవితం అవుతుంది. వారు వున్నారని మనకు తెలిసేసరికి, మనకి వారికి సంఘ సంబంధం ఏర్పడు తున్నది. అందుచేత వ్యక్తిగత జీవితం వ్యక్తిగత నీతి ఈకోణాన మాట వరసకి తీసుకోవలసినవేగాని, నిజానికి నీతి అంటే సంఘ సంబంధాల్లో ఉన్న ప్రవర్తనగానే మనం అర్థం చేసుకోవాలి. ఆస్తికులకైనా నాస్తికుల కైనా ఈకోణాన ఈ సంఘం సంబంధాలలో వున్న నీతే ముఖ్యం. ఈ నాడేకాదు, నాగరికత మొదలు పెట్టినప్పటినుంచి కూడా మనిషి సంఘ జీవిగానే వుంటున్నాడు. అందుచేత నీతి అంటే సంఘ సంబంధాలలో ప్రవర్తనకు చెందినదే. ప్రతి వ్యక్తి జీవితంలోనూ సంఘ సంబంధం ఒక అనివార్యమైన భాగంగా వుంది. నాస్తికునికైనా ఆస్తికునికైనా సంఘ సంబంధాలలో సామరస్యము, సౌఖ్యము కొరకు నీతి తప్పదు. అందుచేత ఆస్తికత్వం కూడా నీతిని గురించే చెప్పింది.

కాని మానవ ప్రవర్తనలో నీతి, దానికి సంబంధించిన త్యాగం ప్రవేశపెట్టడానికి ఆస్తికత్వం ఏ విధానాన్ని అవలంబించింది :

నీతి అంటే సత్యసంధత కదా. సత్య సంధుడు మరణానంతరం స్వర్గానికి వెళతాడని ఆస్తికత్వం చెప్పుతుంది. అది స్వర్గమైనా సరే, మోక్ష మైనా సరే, జన్మరాహిత్యమైనా సరే, దైవానుగ్రహమైనా సరే, ఏదైతే నేమి, నీతి ప్రవర్తన యొక్క ఫలితం మరణానంతరం తెలుస్తున్నదని ఆస్తిక విధానం చెబుతుంది. ఇట్టి ఆస్తిక విధానం వల్ల రెండు లక్షణాలు ఏర్పడ్డాయి.

1. నీతి ప్రవర్తనయొక్క ఫలితం తన మరణానంతరం గాని తెలియదు.

2. నీతి అంటే, మనిషికీ మనిషికీ మధ్యనుండే సంబంధం బదులు, మనిషికీ స్వర్గానికీ మధ్యన ఉండే సంబంధంగా మారిపోయింది.

ఇట్లు ఆస్తిక విధానంలో నీతియొక్క అవశ్యకత సంఘ సామరస్యం కాకుండా స్వర్గం సంపాదన అయింది.

స్వర్గ కాంక్షవల్లనైతే నేమి, ఎందువల్లనై తేనేమి, సత్యసంధత మనిషిలో వుంటే సరిపోతుంది కదా ? అటువంటప్పుడు ఆస్తిక విధానికి ఆక్షేపణ ఏమిటి ? అని అనవచ్చు. దీనికి రెండు విధాలా ఆక్షేపణే. మొదటిది : సత్య సంధత మనిషిలో లేకపోతే, వానిని సరిదిద్ది సత్యసంధుణ్ణి చేసేందుకు ఆస్తిక విధానంలో అవకాశం లేదు. సత్య సంధుడైతే స్వర్గం వస్తుందన్నారు. సత్యసంధుడు కాకపోతే నరకమో, పైజన్మలో పాడు జీవితమో వస్తుందన్నారు. పరలోకమును గురించిగాని, పైజన్మగురించి గాని ఎక్కడా ప్రత్యక్షమైన నిదర్శనాలులేవు. పూర్వకాలంలో ఎప్పుడో వాటి గురించి నమ్మారేమోకాని, జ్ఞానం పెరుగుతున్న కొద్దీ పరలోకం, మరుజన్మ శుద్ధ అబద్ధాలని తేటతెల్లం అవుతున్నది. అందుచేత నీతి ప్రవర్తనకు ఆస్తికత్వము చెప్పిన లాభంకాని, అవినీతికి ఆస్తికత్వం చెప్పిన శిక్షగాని లేవు. ఈ ఆస్తిక భ్రాంతులు విడిపోగానే, వ్యక్తి జీవితం చుక్కానిలేని పడవగా పరిస్థితుల ప్రవాహంలో కొట్టుకుపోతున్నది. అందుచేత ఆస్తికత్వం ఎంత ఆశించినా, ఆచరణలో నీతి కట్టుబాట్లు చెడిపోయినాయి. స్వార్థానికి అడ్డులేదు. యుగ యుగాలబట్టి ఆస్తిక నమ్మకాలు ప్రచారంలో వున్నా, వయస్సుకు తగినంత సత్యసంధత మానవ జీవితంలో పెరగక పోవడానికి కారణం దాని పరలోక దృష్టే.

పోనీ ఒకవేళ ఆస్తిక నమ్మకాల్ని ప్రజలలో బలపరచి సత్యసంధతను కాపాడుదామను కుంటాం. అప్పుడుకూడా మానవ సౌఖ్యం పెరు

గదు. ఎందుకంటే సత్యసంధత, అనగా చెప్పినట్లు చేయుటలో సరిపోదు. ఏమి చెప్పామో కూడా గమనించవలెను

---

ఈ పై వ్యాసంపై ఒకపాఠకుడు చేసిన విమర్శకు గోరా గారు సమాధానమిస్తూ వ్రాసిన విషయాలలోని కొన్ని భాగాలను ఈ వ్యాసం గురించి విపులీకరణకు గాను ఈ క్రింద పొందు పరుస్తున్నాము :

"ఈవ్యాసములో 'స్వార్థము' అను మాటను నేను రెండు అర్థాలలో వాడాను. మొదటిది సంకుచిత స్వార్థము, రెండవది విస్తృత స్వార్థము.

సంకుచిత స్వార్థము విశేషముగా తన వ్యక్తితో ఆగిపోతుంది. ఇతరులతో సంబంధం తక్కువ. ఇట్టి స్వార్థజీవితంవలన వ్యక్తిలోని ఇహలోక ఆశలు విజృంభించవు, ఇది ఆస్తికనీతియొక్క లక్షణము. ఆస్తికులు విశేషముగా పరలోక చింతనలో నిమగ్నులగుటచేత, వారికి యితర మానవులతో సంబంధం అరుదు.

విస్తృత స్వార్థము నాస్తిక జీవిత లక్షణము. దీనికి పరలోక దృష్టిలేదు. వాస్తవిక దృష్టితో సాటి మానవుల సంబంధాలను విరివిగా పెంచుకొను చుండును. ఇట్లు యితరులతో కలయికకు గల కారణం వ్యక్తిగత సౌఖ్య కాంక్షయే. విస్తృత స్వార్థం సంఘనిర్మాణానికి ఆధారమని నాస్తికునిగా నా అభిప్రాయము

సామాన్య భాషలో సంకుచిత స్వార్థాన్ని స్వార్థమనిన్నీ, విస్తృత స్వార్థాన్ని సంఘ దృష్టి అనీ కూడా పేర్కొంటారు. ఇట్లు రెండు రకాల స్వార్థరూపాల తేడాను గుర్తిస్తే నేను నీతిగురించి చెప్పిన విషయాల అర్థం సుస్పష్టం కాగలదని ఆశిస్తాను. నా వ్యాస శీర్షిక "ఆస్తికనీతి విధా

నం స్వార్థనికి దారి తీసింది" అని అంటే, సంకుచిత స్వార్థం అని నా అభిప్రాయం.

మరొకటి : నాస్తికత్వమంటే దేవుడు, దయ్యాలు మూఢ నమ్మకాలను ఖండించడమేనా అని ప్రశ్నించారు. మూఢ నమ్మకాలను ఖండించడమే నాస్తికత్వం కానేరదు. నాస్తికత్వం అంటే స్వాతంత్ర్యాభ్యుదయం, వాస్తవికదృష్టి, నీతిప్రవర్తన. నాస్తికత్వం యొక్క నిజస్వరూపమును ప్రజలముందు పెట్టుటకుగాను తరదుకట్టిన ఆస్తిక నమ్మకాలను ముందుగా తొలగించవలసి వస్తున్నది. ప్రజలు ఆస్తిక నమ్మకాలకు తరతరాలబట్టి అలవాటుపడి యుండుటచేత, నాస్తికత్వం అనగానే తొలిగా ఆస్తిక వ్యతిరేకమనే భావిస్తారు. ఈ మొదటి దశ దాటిన తర్వాత నాస్తికత్వంయొక్క స్వాతంత్ర్య లక్షణం బయట పడగలదు. నిజానికి నాస్తికత్వమంటే ఆస్తికత్వ వ్యతిరేకతేకాదు. అది ఒక ప్రత్యేక జీవిత విధానం.

## సౌఖ్యం కొరకు నీతి రీతుల్ని మార్చుకోవాలి

నీతి ఎందుకు కావాలి ? సంఘసామరస్యము చేకూర్చి. సంఘసాను భూతివల్ల వ్యక్తుల సౌఖ్యం అధికమగుటకు నీతి కావాలి. అందుచేత అడుగడుక్కీ నీతిరీతుల్ని పరీక్షించుకోవాలి. ఒకప్పుడు సంఘ సామరస్యాన్ని కలిగించిన కులతత్వం ఈనాడు పనికిరాదు. అందుచేత నీతిని కాపాడడానికని ఆనాటిరీతి ఈనాడు మారవలసివుంది. మానవుల విజ్ఞానము అనుభవము అభివృద్ధి పొందుతున్న కొద్దీ అదే నీతికొరకు రీతుల్ని మార్చుకుంటూ వెళ్ళాలి.

ఉదాహరణకు ఆరోగ్యం కొరకు వైద్యుడు మందు ఇస్తాడు. ఈనాడు ఇచ్చిన మందువల్ల రేపు రోగం గుణంమారుతుంది ఆమార్పును అనుసరించి తాను మందులనుకూడా మార్చుకోవాలి. ఇవాళ రేపు, ఎల్లుండి

ఎవ్వరు మందు ఇచ్చినా ఆరోగ్యాన్ని పోషించడమే వైద్యుని లక్ష్యం. కాని ఇవాళ-రేపు-ఎల్లుండి ఇచ్చే మందులలో మార్పువుంటుంది. అలాగే ఒకే నీతిని పోషించడానికని రీతులలో మార్పువస్తుంది. రోగముయొక్క స్వభావమును దినదినమూ పరీక్షించుకుంటూ మందును వైద్యుడు ఏవిధంగా మారుస్తున్నాడో అలాగే సంఘంలో వ్యక్తుల సౌఖ్యాన్ని దినదినమూ చూసుకుంటూ నీతి రీతుల్ని మార్చుకోవాలి.

ఆ నీపరు సోదర మానవులవైపు చూడడు. వారి సుఖదుఃఖాలతో వీనికి నిమిత్తంలేదు. స్వర్గానికి తనకే సంబంధం. ఆ స్వర్గం తనకు ప్రత్యక్షమైన విషయంకాదు, మార్పుచెందే విషయంకాదు. అందుచేత తాను చిన్నప్పుడు ఏ నీతిరీతికి అలవాటు పడ్డాడో, ఆరీతి మారకుండా అలాగేవుండి పోతుంది. ఆరీతిలో తాను సత్య సంధుడుగా వుండవచ్చు. కాని అతని సత్యసంధత సౌఖ్యాభివృద్ధికి తోడ్పడదు. దినానుదినము మారుతున్న రోగగుణమును గమనించకుండా ఒకే మందును వాడుచున్నటువంటి వైద్యునకు రోగియెడల ఎంత ఆదరణ, ఆవేదన ఉన్నప్పటికీ ఆమందు నిష్ఫలమే కాకుండా రోగికి ప్రాణహానికూడా తీసుకువస్తుంది. అలాగే తోటిమానవుల సౌఖ్యాన్ని గుర్తించకుండా పాతరీతుల యెడల సత్యసంధతకు బిగుంచుకొని కూర్చున్న ఆ స్తికుని ప్రవర్తనకూడా. అది నీతికాదు; అది సంఘ సామరస్యానికి ప్రమాదము తెచ్చిపెడుతున్న మూర్ఖత్వం. అట్టివాడు ఎంత సత్యసంధుడో అంత బాధ స్తుడు కూడాను.

ఇట్లు మానవుని ప్రవర్తనలో ఆస్తికత్వం నీతిని కోరుతున్నప్పటికీ తన విధానంలోని లోటులవల్ల ఒక వైపునుంచి స్వార్థాన్ని, ఇంకొకవైపు నుంచి బాధస్తాన్ని పెంచింది. నీతి, సామరస్యము, సౌఖ్యము వెనకబడి పోయినాయి ఆ స్తికత్వం వలన ఆత్మహత్యలు, విరక్తులు, పరనిందలు, కక్షలు, మూర్ఖపు పట్టుదలలు, ద్వేషాలు, దౌర్జన్యాలు, రక్తపాతాలు ప్రబలి పోతున్నాయి. ఇది నీతా? అయ్యవార్లం గారిని చేయబోయి కోతిని

చేసినట్లు, నీతికొరకె ప్రయత్నించి చివరకు ఈ ఆస్తిక విధానం నీతి కన్నా హెచ్చు అవినీతినే ప్రవేశ పెట్టినది. దాని ఫలితమే ఈ రోజున మానవుల మధ్య చెలరేగుతున్న యుద్ధాలు, కలహాలు, కాటకాలు, వ్యక్తులు కూడా విశేషంగా స్వార్థులుగాను, మూర్ఖులుగాను, చాదస్తులుగాను తయారవుతున్నారు.

ఆస్తిక విధానము ననుసరించడం వలన పెడత్రోవను పడిపోయిన మానవ ప్రవర్తనను సరిదిద్ది, నీతిని నిలుప గలిగినది నాస్తిక విధానమే. అసలు నీతి అంటే సంఘ కలయికలో సామరస్యాన్ని, సౌఖ్యాన్ని పెంపొందించే ప్రవర్తన కదా. అందుచేత మానవునికి మానవునికి మధ్య వున్న సంబంధమే నీతికి మూలం. ఆస్తికవిధానం ఆ మూలానికే మోసం తెచ్చింది. వ్యక్తిదృష్టిని ఇతర వ్యక్తుల వైపు గాక, స్వర్గం వైపు త్రిప్పి వేసినది. దానితో అసలు నీతియొక్క మూలాధారమే తప్పుత్రోవన పడిపోయింది. నాస్తికవిధానం దాన్ని సరిదిద్దుకున్నది. వ్యక్తి దృష్టిని స్వర్గం వైపు నుంచి సోదరమానవుని వైపు నాస్తికత్వం మరలిస్తున్నది. అనగా మానవునికి, మానవునికి మధ్య సంబంధాన్ని మరల నాస్తికత్వం కలిపిస్తున్నది. నీతిని నెలకొల్పుటకు ఆస్తికవిధానానికి నాస్తికవిధానానికి ఉన్న ముఖ్యమైన తేడా యిది.

నా దృష్టి ఎప్పుడైతే స్వర్గంనుంచి సాటి మానవుని వైపు మరలిందో, అప్పుడు వెంటనే నాప్రవర్తనలో మార్పువచ్చింది. నా చాదస్తాలు, నామూర్ఖపు పట్టుదలలు, నాస్వార్థాలు తొలగిపోయినాయి. తోటివారితో ఏ విధంగా ప్రవర్తిస్తే సామరస్యము, సౌఖ్యము వృద్ధి పొందుతాయో క్షణ క్షణం ఇప్పుడు ఆలోచిస్తున్నాను. నాప్రవర్తనకు సంఘ సామరస్యము, సౌఖ్యం గీటురాళ్ళు. రోగముయొక్క నడకను చూచుకుంటూ మందును మార్చుకుంటున్న వైద్యునివలె నేనుకూడా అనుక్షణము నాప్రవర్తనా రీతులను పరీక్షించుకుంటూ వుంటాను. అనగా నాప్రవర్తన సరియైన రీతిని అనుసరిస్తోంది.

# సత్యసంధత, బాధ్యతా నిర్వహణ
# ఇవే నాస్తికుని నీతి, ధర్మాలు

సామరస్యం గాని, సౌఖ్యంగాని తగ్గినప్పుడల్లా నా ప్రవర్తన తప్పు దారి పట్టిందని నేను గ్రహించు కుంటాను. వెంటనే సరిదిద్దుకుంటూ వుంటాను. ఈ విధంగా నాలో సంఘ చైతన్యం పెంపొందుతుంది. సదా నీతి నిలుస్తూ వుంటుంది. అభివృద్ధి కలుగుతూ వుంటుంది.

ఇంకొకటి. ఆస్తిక విధానంలో వ్యక్తికీ స్వర్గానికే సంబంధం. అందుచేత ఒక వైపు వ్యక్తి వుంటే, రెండవవైపు అడిగేదిగాని పలికేది గాని ఏమీలేదు. ఎంతసేపూ వ్యక్తి ఆత్మపరీక్ష చేసుకుంటూ కూర్చోవాలి. అందుకనే ఆస్తికవిధానంలో అన్నీ ధర్మాలు చెప్పి వుంటాయి. ఇలాగ చెయ్యి అలాగ చెయ్యి అని వ్యక్తికి చెప్తూ వుంటారు. అతను అలాగ చెయ్యకపోతే అడిగేవాళ్ళు ఉండరు. చేసేరీతుల్లో అభివృద్ధిని సూచించే వారులేరు. ఎంతసేపూ "విధులు, విధులువిధులు" అంటూ ఒక్కడూఎప్పుడూ కళ్ళుమూసుకొని నడచి పోతూ ఉంటాడు. ఇతరులకు తనవల్ల లాభము లేదు సరికదా, తాను గ్రుడ్డిగా ఇటూ అటూ చూడకుండా పోవడం చేత అడ్డులు తగిలి బోల్తా పడుతూ వుంటాడు.

నాస్తికుని ప్రవర్తన అట్లుకాదు. పాటి మానవుల మధ్య ప్రవర్తిస్తూ వుంటాడు. తాను నిలుచుంటే, తన ఎదురుగా తనవంటి వారే నిలుచుని వున్నారు. గుడ్డిగా ప్రవర్తించడానికి వీలులేదు. తనకు విధులెన్ని వున్నాయో, హక్కులు కూడా అన్నీ వున్నాయి. తాను చేయవలసిన పని విధి, ఇతరులనుంచి తాను ఆశించవలసిన పనులు తన హక్కులు, ఒక్క విధుల్ని నెరవేర్చితే చాలదు; హక్కులను కోరకపోతే స్వార్థానికి అడ్డు వుండదు.

ఉదాహరణకు తాను నిజం చెపుతూ వుంటే, తాను సత్యసంధుడు అవుతాడు. సత్యసంధత తన విధి. అంతటితో సంఘంలో సత్యం పెరగదు. సంఘంలో సత్యసంధత నిలవాలంటే, తాను సత్యసంధుడిగా వుండి తన విధిని నెరవేర్చుకుంటూ, ఇతరులు సత్యసంధులుగా వుండవలెనన్న హక్కునుకూడా కోరాలి, 'నేను నిజం చెప్పుతాను' అది నావిధి. 'నువ్వు నిజం చెప్పాలి' అది నా హక్కు. ఈ రెండూ కలిస్తేనే సంఘంలో బలం ఏర్పడుతుంది. 'నువ్వు నిజం చెప్పాలి' అనే హక్కును కోరకుండా నేను నిజం చెప్పుతూ పోతే నేను చాదస్తుణ్ణి అవుతాను.

ఒక్క విధులను చేయుచుండుట కంటే, హక్కులను కూడా కోరుట నీతిని నిలుపుటలో ఒక అడుగు ముందుకు వేసినట్లే; కాని అంతటితో అది చాలదు. హక్కులను కోరినంత మాత్రాన అవి జరగక పోవచ్చు. అందుచేత హక్కులను జరిపించుకొను విధి కూడా నాస్తికుడు తనపై వేసుకుంటాడు.

ఇట్లు చూడగా నీతికై ప్రయత్నించు విధానములు మూడు దశలు. 'నేను నిజం చెప్పుతాను' ఇది మొదటి దశ. ఇందులో ఒక్క విధే వున్నది. 'నేను నిజం చెప్పుతాను; నీవు నిజం చెప్పాలి' ఇది రెండవదశ. ఇందులో విధి, హక్కు వున్నాయి.

'నేను నిజం చెప్పుతాను. నీచేత నిజం చెప్పిస్తాను' ఇది మూడవ దశ. ఇదీ వుత్తమమైన నీతి ప్రవర్తన. నాస్తికత్వమందు ఆత్మవిశ్వాసము, సంఘదృష్టి కలవు కనుక, నాస్తికుడు ఈ మూడవదశను అనుసరించుచుండును. దీనివలన నాస్తికుడు అవినీతిపరుడు కానేరడు; అవినీతిని మానవ సమాజములో ఉండనీయడు.

మొదటి దశలో సత్యసంధత ఉన్నది. కాని అందులో సంఘదృ... లేదు. రెండవదశలో సంఘదృష్టి ఉంది కాని అది బలహీనముగా ఉన్నది. మూడవదశ సత్యాగ్రహ దశ. ఇది బలమైన నీతి. అట్టి బలమైన నీతిని

నాస్తికత్వం సాధిస్తుంది. ఆస్తికుడు సత్యసంధుడైతే నాస్తికుడు సత్యాగ్రహి.

సత్యసంధుల ఆశయం మరణానంతరం మోక్షం. సత్యాగ్రహుల ఆశయం సంఘ సామరస్యం. సంఘ సౌఖ్యం. మోక్షకాంక్షలో స్వార్థం ఉంది. 'ఎవరెలా పోతేనేమి, నేను మోక్షాన్ని పొందాలి' అనేది స్వార్థ దృష్టి. అందుకనే "ఎవరి పాపాన వారు పోతారు. దేవుడు లేడా చూడటానికి" అను బలహీనపుమాటలు ఆస్తికులు అంటూ ఉంటారు. స్వర్గము, మోక్షము, జన్మరాహిత్యము, భగవంతుడు మొదలయిన ఆస్తిక నమ్మకాలు ఒకప్రక్క శుద్ధ అబద్ధాలు కాగా మరొకప్రక్క ఆస్తికవిధానం మానవులను స్వార్థులుగా కూడా తయారు చేసింది.

ఆస్తిక భ్రాంతులను నాస్తికత్వము చెదరగొట్టి మానవులలోని సంఘదృష్టిని పెంపొందించి సత్యాగ్రహముల వల్ల నీతిని నిలబెట్టుతున్నది. "ఎవరి పాపాన వారు పోతారు" అని ఏ నాస్తికుడూ ఏ అవినీతిపరునీ వదలిపెట్టడు ఎక్కడికక్కడ స్వార్థులను పట్టుకొని అవినీతిని అణచి వేస్తాడు.

ఈ విధంగా నీతిని సాధిస్తున్న సంఘం పుష్టిగాను, సజీవంగానూ ఉంటుంది. నాస్తికవిధానంచే ఏర్పడుచున్న సంఘం సత్య సంధులన మూహం కాదు. సత్యసంధతయందు ఏకీభావంకల్గిసభ్యులకలయిక ఈ నాస్తికసంఘం. ఈ సంఘమందు ఎవరిమటుకు వారు సత్యసంధులై ఉంటే చాలదు. తాను సత్యసంధుడై వుండాలి; ఇతరులు కూడా సత్యసంధులుగా వున్నారని ప్రతి వారికీ తెలిసి వుండాలి. దీనివలన పరస్పర సానుభూతి, ఏకీభావము ఏర్పడును. మరియు ఎవరూ స్వార్థులై దిగజారుటకు వీలుండదు. ప్రతి వాని మీద ఇతరుల అజమాయిషీ ఉంటూ వుంటుంది. ప్రతి సభ్యుడు

ఏకీభావమును పోషించవలయును. లేదా అతనిపై ఇతరుల ఒత్తిడి ఉండును. నాస్తికవిధానములో సంఘమనగా సమూహమే కాదు; సంఘ మనగా సహకారము, నీతి. సంఘ సంబంధములలో సహకరించుటకై ప్రతివానికి స్వేచ్ఛ కలదు. స్వార్థులుగా దిగజారు స్వేచ్ఛను ఇతరులు అడ్డగిస్తారు.

## సత్యాగ్రాహి నిర్వచనము

సత్యాగ్రహం అనగానే సాధారణంగా ప్రభుత్వం మీద తిరుగుబాటు శాసనోల్లంఘనం, అరెస్టులు, జైళ్ళు జ్ఞాపకం వస్తాయి. ఎందుకంటే గాంధి మహాత్ముని నాయకత్వంక్రింద నడచిన భారత జాతీయోద్యమాన్ని సత్యాగ్రహం అన్నారు. నీతిని నిలపటానికి నాస్తికత్వం అవలంబించే సత్యాగ్రహానికీ, భారత జాతీయోద్యమంలో గాంధీ ప్రయోగించిన సత్యాగ్రహానికీ సంబంధం ఏమిటో చూద్దాం.

సత్యాగ్రహం అనగానే 'నేను నిజం చెబుతాను, నీచేత నిజం చెప్పిస్తాను' అను బలమైన నీతి ప్రవర్తన అని నిర్వచించాము. ఇటువంటి బలమైన నీతి వలననే సంఘం అవినీతిలోనికి దిగజారకుండా ముందుకు సాగిపోగలదు.

గాంధీ గట్టి నీతిపరుడు. తాను సత్యసంధుడై కాళ్ళు ముడుచుకు కూర్చునేవాడు కాదు. ఆయన సత్యాగ్రహి. అవినీతిని ఎదుర్కొంటాడు. సంఘంలోని నీతిని అభివృద్ధిపరచాలని ఆయన ప్రయత్నిస్తూ వుంటే, ప్రభుత్వంలోని అవినీతి ఆయనకు అడ్డువచ్చింది. ఈ అడ్డును తొలగిస్తే తప్ప, ప్రజలలోని నీతి అభివృద్ధి పొందేట్టు లేదు. అందుచేత ఆయన సత్యాగ్రహిగా ప్రభుత్వంలోని అవినీతిని ఎదుర్కొన్నాడు. గాంధీ దృష్టిలో ఉన్నది సంఘ నిర్మాణం. దానికి కావలసినది నీతి ప్రవర్తనే కాని ప్రభు

త్వాన్ని ఎదుర్కొనడమే కాదు. అయినప్పటికీ, నీతి వృద్ధికి ఆ ప్రభుత్వ విధానం అడ్డువచ్చింది కనుక, దానిని సత్యాగ్రహిగా ఎదుర్కొన్నాడు. ఇట్లు గాంధీ నడిపిన భారత జాతీయ పోరాటం రాజకీయ యుద్ధం కాదు, అది మానవజాతిని అభివృద్ధి పరచే సత్యాగ్రహోద్యమం. ఇది ఒక్క పర ప్రభుత్వంలోని అవినీతిని ఎదుర్కొనుటతో ఆగిపోదు. ఏ ప్రభుత్వ విధానంలోనైనా సరే, ఎవరిలోనైనా సరే అవినీతి రూపాలైన ఎక్కువ తక్కువలను ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ నీతిని వృద్ధి చేస్తుంది.

రాజకీయం యొక్క లక్ష్యం ఒక్క ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకోవడమే. అందుచేత రాజకీయాల్లో యుద్ధం, దౌర్జన్యం, కుట్రలు వుంటాయి. రాజకీయాలకు మించింది నీతి. నీతి స్థాపనకు అహింస అవసరం. అభిప్రాయభేదం వచ్చినంత మాత్రాన ఎదుటివారిని చంపివేసినా, జైలులో బంధించినా అది నియంతృత్వం అవుతుంది గాని, నీతికి ప్రధానమగు ఏకీభావం పెంపొందటానికి తోడ్పడదు. రాజకీయాల్లో హింస ఉండవచ్చు. సత్యాగ్రహం అహింసను అవలంబిస్తుంది.

సత్యాగ్రహిగా ప్రభుత్వంలోని అవినీతిని ఎదుర్కొన్నప్పుడు, అహింసా విధానాలయిన శాసన ఉల్లంఘన, పన్నుల నిరాకరణ, సహాయ నిరాకరణలను గాంధీ ప్రయోగించాడు. తోటివారిలోని అవినీతిని తుడిచి వేయుటకు మందలింపు, ప్రబోధం నిరశనవ్రతం సత్యాగ్రహ మార్గాలయినట్లే ప్రభుత్వంలోని అవినీతిని ఎదుర్కొనుటకు శాసన ఉల్లంఘనం మొదలైనవి సత్యాగ్రహ రూపాలు.

అందుచేత సత్యాగ్రహమనగా బలమైన నీతి.

నేను సత్యం చెప్పుతాను, నీచేత సత్యం చెప్పిస్తాను.

నేను అబద్ధం ఆడను, నిన్ను అబద్ధం ఆడనివ్వను.

నేను నీతో అనమానంగా వుండను, నిన్ను అనమానంగా వుండ నివ్వను.

నేను హింస చెయ్యను, నిన్ను హింస చెయ్యనివ్వను.

ఇవన్నియు సత్యాగ్రహ సూత్రాలే.

నీతి విశాల మానవ సంఘానికి చెందింది. అందులో ప్రభుత్వం ఒక ముఖ్యమైన భాగం. ఎక్కువ తక్కువలను పోషించే విధానం ప్రభుత్వంలో ఉన్నంతకాలం ఆ విధానాన్ని సత్యాగ్రహులు ఎదుర్కొనవలసిన అవసరం వుంటూనే వుంటుంది. నూటికి నూరుపాళ్ళు సంఘములో నీతి ఉండుట ఆదర్శప్రాయమే కనక, పరిపాలనలో గల నిర్బంధ విధానాలను సత్యాగ్రహి సరిదిద్దుతూ వుంటాడు. నాస్తికుడు సత్యాగ్రహి కనుక, నాస్తికునకు రాజకీయాలతో నిరంతర సన్నిహిత సంబంధం ఉండి తీరుతుంది.

## నాస్తికుడు దుర్మార్గుడా ?

నీతి పెరగాలంటే నాకు నాస్తికత్వం కావలసి వచ్చింది. అనుభవంలో నాస్తికత్వము ఫలవంతంగా వుంది. ఉత్సాహాన్ని అభివృద్ధిచేసింది. ఇంత ఉపయోగకరంగా నాస్తికత్వం ఉంటే, సామాజిక సంబంధాలలో నాస్తికత్వం అంటే చాల వ్యతిరేక దృష్టి వుంది. "నువ్వు మంచివాడివే కాని ఆ నాస్తికత్వమే వచ్చింది. నీకున్న లోటల్లా" అని మిత్రులు నన్ను చూసి జాలి వెల్లడిస్తారు. ఇది నాకు చాల ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. నేను నాస్తిక దృక్పథం అవలంబించడం చేతనే నాలో నీతి, దీక్ష పెరిగాయి. ఇది నా అనుభవం. అటువంటప్పుడు నాలోని దీక్షని అభినందిస్తూ ఈ దీక్షకు ఆధారమైన నాస్తిక దృక్పథాన్ని నిరసించడం నాకు పరస్పర విరుద్ధంగా కనపడింది.

సరే, పరిశీలిస్తే ఈ అవక తవకకు అర్థం తెలిసింది. నిజంగా నాస్తిక దృక్పథం వలననే నీతి పెంపొందుతుంది. కాని వ్యావహారిక భావాలలో మాత్రం నాస్తికత్వం అంటే దుర్మార్గం అని విరివిగా ప్రచారం అయిపోయింది. నిఘంటువుల్లో కూడా 'నాస్తికుడు' అంటే "దేవుడు లేడు అనే వాడు." దేవుడు లేని వాడు దుష్టుడు. దుర్మార్గుడు అని నిర్వచనాలు చేయబడి ఉన్నాయి. ఇది తమాషా అయిన విషయము. సమాజం ఒక వైపున నీతి అభివృద్ధిని కోరుతూ ఉంది. కాని ఇంకొక వైపున నీతికి సాధనమగు నాస్తికత్వానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని, వాతావరణాన్ని కల్పిస్తుంది. ఈ అవక తవక ఎందుకు కలిగింది?

ఎవరినైనా నిలబెట్టి "నీతికావాలా? వద్దా?" అని అడిగితే తప్పకుండా నీతికావాలి అని జవాబిస్తారు. ప్రతివాడూ నీతిని కోరుతూవున్నాడు గదా. అటువంటప్పుడు సమాజంలో నీతి ఎందుకు విరివిగా పెరగలేదు? అన్నప్రశ్నత. నిగ్రోసమస్య ఉన్న సమాజంలో నీతి బాగా వుండగలమా? దారిద్ర్యంతో బాధపడే ప్రజ కోటానుకోట్లుండగా, కొద్దిమంది కోటీశ్వరులు కులుకుతూ ఉండటం నీతి అంటామా? ఒకవైపున అందరూ నీతిని కోరుతూఉండగా – రెండోవైపున నీతి ఎందుకు వృద్ధిపొందలేదు? ఆలోచించండి.

ఇప్పుడున్న సామాజిక స్థితిలో ఎక్కువ తక్కువలు ఉన్నాయి. కొందరు అధిక అవకాశాల్ని అనుభవిస్తున్నారు. నీతి ప్రబలితే ఎక్కువ తక్కువలు ఉండటానికి వీలులేదు. సమాజంలో నీతి ప్రబలడం అంటే అందరకూ సమమగు జీవిత అవకాశాలు ఉండటం, నీతి ప్రబలితే అధిక అవకాశాలు అనుభవిస్తున్నవారి ఆధిక్యతలు పోతాయి అందరూ సమం అవుతారు. అందుచేత ఈ అధిక అవకాశాలు అనుభవిస్తున్నవారు నీతి

పైకి లేవనివ్వరు. అలాగని నీతి వద్దని బహిరంగంగా చెప్పలేరు. ఎందు కంటే సంఘనిర్మాణానికి నీతి ఆధారము. అందుచేత ఒకవైపున నీతి కావాలని అంటూ రెండో వైపున నీతిని పెంచే సాధనమగు నాస్తికత్వం పైకిలేవకుండా అడ్డుపడతారు. "నీతికావాలి, కాని నాస్తికత్వం తప్పు" అంటే "అన్నం కావాలి. వంటవద్దు" అన్నట్లుంటుంది. నాస్తికత్వాన్ని నిషేధించటం అంటే పర్యవసానంలో నీతి లేవకుండా అణచివేయడం అవుతుంది. అందుచేత అధిక అవకాశాలు అనుభవిస్తున్నవారు నీతి పొగడుతూ నాస్తికత్వాన్ని నిందిస్తారు. ఈ మోసంలో ప్రజానీకాన్ని పడవేయడానికి ప్రయత్నిస్తారు. నాస్తికత్వాన్ని ఎన్ని విధాల అడ్డడానికి వీలుందో అన్నివిధాల చూస్తారు. నాస్తికత్వం అంటే దుర్మార్గమని ప్రచారముచేస్తారు. నాస్తికుల్ని దండించాలంటారు. ఇన్ని తాపత్రయాలూ ఎందుకంటే నీతి నిజంగా పెరగకూడదని.

ఈ ప్రచారానికి బెదిరిపోయి, నీతియందు ప్రీతివున్నవారు కూడా తమను ఎక్కడ నాస్తికులని అంటారో అని జంకి, ఆచరణలో వెనక్కి తగ్గుతారు.

నీతిని పెంచాలని ధీరులుగా నిలిచిన వారందరూ వారి వారి కాలాలలో నాస్తికులుగా హింసించబడ్డవారే. అందుచేత నాస్తికత్వం అంటే దుర్మార్గత కానేకాదు నిజానికి నాస్తికత్వం, అంటే నీతి. నాస్తికత్వము దుర్మార్గత అని ప్రచారము చేయడం దుర్మార్గం, మోసం, స్వార్థం. నీతి యందు ప్రీతి వున్నవారందరూ నాస్తికులై తీరాలి, నిఘంటువులను తిరిగి వ్రాయాలి, భాషా సాంప్రదాయాలను సరిదిద్దుకోవాలి. నాస్తికత్వం అంటే నీతి, నీతి, నీతి అని వేయినోళ్ళతో చాటాలి.

# రాజకీయాలు - నాస్తికత్వం.

నా జీవితానికి నేనే కర్తను, నా సంఘనిర్మాణానికి నేనే కర్తను అను ఆత్మ విశ్వాసం నాలో నాస్తిక దృష్టివల్ల పెరగగానే నాకూ రాజకీయాలకూ వున్న సంబంధం కూడా మారింది. నాలో నాస్తిక భావాలు పెరుగుతున్న కొద్దీ నాకూ, రాజకీయాలకూ వున్న సంబంధం దగ్గరయింది. అంతవరకూ నాకూ రాజకీయాలకూ సంబంధం లేదను కున్నాను. రాజకీయాలతో సంబంధం వద్దనికూడా పీరూవారూ సలహా ఇస్తూవచ్చారు. కాని నాస్తిక భావాలు పెరుగుతూ వుంటే, రాజకీయాలంటే ఏమిటో, రాజకీయాలతో సంబంధం ఎందుకు వుండితీరాలో స్పష్టం అయింది.

రాజకీయాలంటే ఏమిటి? రాజకీయాలు అంటే ప్రభుత్వనిర్వహణ అనుకుందాం. అయితే ప్రభుత్వాన్ని ఎందుకు నిర్వహించాలి,? ప్రజలకు కూడూగుడ్డా కలుగ చేయటానికి, ప్రజలలో నీతి-నియమాలు నిలబెట్టడానికే ప్రభుత్వం కావాలి. ప్రభుత్వ శాసనాలు ప్రజల సౌకర్యము కొరకేగదా అటువంటప్పుడు నాకు ప్రభుత్వంతో సంబంధం లేకుండా ఎలాగపోతుంది.

ఆస్తికులయితే తమ సుఖదుఃఖాలకు దైవమో, కర్మో కారణం అనుకొంటారు. ఏ ఆపద వచ్చినా దైవాన్ని వేడుకుంటారు, వారికి ప్రభుత్వం దృష్టిలేదు. ప్రభుత్వంతో సంబంధం లేదని కాని, సంబంధం వద్దనికాని చెప్పేమాటలు ఆస్తిక సాంప్రదాయాలు. నాస్తికునికి అది ఎలాగ సరిపోతుంది? నా నిత్య జీవితానికి ప్రభుత్వానికి సంబంధం నాకు స్పష్టంగా కనబడుతోంది. నా చుట్టూ వున్న దారిద్ర్యానికి కులమత ద్వేషాలకు ప్రభుత్వానిదే బాధ్యత. వ్యక్తిగత ఆస్తి వలన వారసత్వపు హక్కుల వలన ఆస్తులలో ఎక్కువ తక్కువలు ఏర్పడ్డాయి, ప్రత్యేక నియోజక

వరాలవలన, మత విశ్వాసాల పట్ల అభిమానంవలన కుల, మత భేదాలు సమాజంలో నిలవగలుగు తున్నాయి. ప్రభుత్వం శాసనాలు చేస్తే, సంఘం మొత్తంమీద పెద్దమార్పులు ఎందుకని రావు? అందుచేత సంఘంలో మార్పులకూ ప్రభుత్వానికీ సంబంధం వుంది. నేను సంఘాన్ని నిర్మిస్తున్నాను. అందుచేత నాకూ రాజకీయాలకూ సంబంధం వుండి తీరింది.

నా సుఖదుఃఖాలు దైవ నిర్మితాలని ఒప్పుకోను కదా. దైవ నమ్మకము త్రోసిపుచ్చితే ప్రభుత్వం బాధ్యత బైటపడుతుంది.

ఆస్తికులు ఒకవైపున దైవాన్ని నమ్మినా, యదర్థాలతో సంబంధం పెట్టుకున్నప్పుడు వారికీ రాజకీయాలతో సంబంధం వస్తుంది కాని వారి జీవితంలోకొంత దైవనమ్మిక, కొంతప్రభుత్వ బాధ్యత వుండి. ద్వైద్వంగా వుంటుంది. నాస్తికుడు అట్లుగాదు. నాస్తికుని సంబంధం పూర్తిగా ప్రభుత్వంతోనే. అందుచేత నాస్తికునికి రాజకీయాలతో పూర్తి సంబంధం వుంది.

అయితే నాస్తికుని రాజకీయాలు ఏ విధంగా వుంటాయి?

## నాస్తికునికి రాజకీయదృష్టి :

రాజకీయాలంటే ప్రభుత్వ నిర్వహణ కదా. ప్రభుత్వ నిర్వహణ ముఖ్యంగా మూడు విధాలుగా వుంటుంది. రాజపాలన, నియంతంత్వం, ప్రజాస్వామ్యం.

రాజపాలన, నియంతృత్వములలో శాసనాలు చేసే అధికారం పూర్తిగా రాజుకో, నియంతకో వుంటుంది. రాజు వారసుడు రాజు అవుతాడు. నియంత నియమితుడు సాధారణంగ నియంత అవుతాడు. అందుచేత శాసనాలు చేసే సందర్భంలోగాని, పరిపాలకుని ఎంచుకునే సందర్భంలోకాని ప్రజలజోక్యం వుండదు. ఈ రెండు విధానాలలోనూ ప్రజ ఎంతసేపూ ప్రభుత్వానికి లొంగి వుండవలసిందే. ప్రజలు లొంగి వుంటేనే పరిపాలన సాగుతుందన్న సామెతకూడా వుంది.

లొంగిపోవటం బానిస లక్షణం. ఆస్తికత్వం బానిస ప్రవృత్తి కనక, రాజపాలన, నియంతృత్వం ఆస్తిక విధానాలు. ఆస్తికుడు దేనికో ఒక దానికి లొంగి వుంటాడు. దేవుడినో, కర్మనో, విశ్వాసాలనో తన నెత్తి మీద ఎక్కించుకుంటాడు, తాను దానికి లొంగి ఉంటాడు. రాజకీయాల్లో ఆస్తికుడు రాజ పాలననో, నియంతృత్వాన్నో ఏర్పరుచుకుంటాడు. రాజు క్రిందో, నియంత క్రిందో ఆస్తికుడు లొంగి పడిఉంటాడు

నాస్తికత్వం స్వాతంత్ర్య ప్రవృత్తి. లొంగిపోవటానికి వ్యతిరేకం. అందుచేత నాస్తికుని రాజకీయ విధానం రాజపాలనకు, నియంతృత్వానికి తేడాగా వుంటుంది. నిజానికి నాస్తికుడు రాజపాలనను నియంతృత్వాన్ని సహించడు. సంఘనిర్మాణంలో నాస్తికుడు సహకరిస్తాడుగాని లొంగి వుండడు. అందుచేత నాస్తికుని రాజకీయవిధానం ప్రజాస్వామికమే. ప్రజాస్వామికములో ప్రజలే ప్రభుత్వ విధానాన్ని ప్రభుత్వ అధికారులని నిర్ణయించుకుంటూ వుంటారు. ఇందులో ఒకరితో ఒకరు సహకారమేకాని, ఎవరికీ ఎవరూ లొంగి వుండటంలేదు.

ప్రజలలో నాస్తిక ప్రవృత్తి పెరుగుతుండటంచేత పూర్వకాలపు రాజపాలనలు, నియంతృత్వాలూ ఇప్పుడు తగ్గిపోయాయి. ప్రభుత్వాలు ప్రజాస్వామికాలుగా మారిపోతున్నాయి, కాని ప్రజానీకం ఇంకా నాస్తిక సిద్ధాంతాన్ని బహిరంగంగా అంగీకరించడంలేదు. వారిదృష్టి ఆస్తికత్వానికి నాస్తికత్వానికి మధ్య ఊగిసలాడుతున్నది. పాత సాంప్రదాయాలు ఆస్తికత్వంవైపు లాగుతూవుంటే, ఆచరణ నాస్తికత్వంవైపు ప్రవహిస్తున్నది. ఇలాగ అటూఇటూ కాకుండా ఉండటంచేత ఒకవైపున రాజపాలనను సహించలేకున్నారు, ఇంకొకవైపు గట్టిప్రజాస్వామికాన్ని నిర్మించుకోలేకున్నారు. అందుచేత రాజపాలనలు అంతమొందాయి. పేరుకు ప్రజాస్వామికాలు ఏర్పడ్డాయి, కాని ఆచరణలో ప్రజాస్వామికాలు నియంతృత్వాలలోనికి దిగజారిపోతున్నాయి. ఒక వ్యక్తిక్రిందకు కాకపోయినా, ఒక ముఠాపెత్తనంక్రింద ఈనాటి ప్రజాస్వామికాలు పడిపోతున్నాయి. ఇటువంటి స్థితిలో నా స్థానము ఏమిటి?

నేను ప్రజాస్వామికాన్ని నెగ్గించి తీరాలి. రాజుపాలన ఎలాగా పోయింది. ప్రస్తుత ప్రజాస్వామికాలు నియంతృత్వంలోనికి దిగజారకుండా చూచే బాధ్యత నాది.

ప్రజాస్వామికాలు పాడయిపోతున్నాయే అని దిగులుపడి కార్యం లేదు, మంత్రుల నియంతృత్వ చర్యల్ని నిందించి కార్యంలేదు. తోటిప్రజ కలసిరావటంలేదని నిరాశచెందటం నాస్తికుని లక్షణమేకాదు. అందుచేత ఇట్టిస్థితిలో నేను ఏమి చేయాలి? సమస్యను వర్ణించడంకాదు కావలసింది. సమస్యను పరిష్కరించాలి, పరిష్కరించే బాధ్యత ఎవరిపైన వారే వేసుకోవాలి. నేను నా బాధ్యతను ఎలాగ నిర్వహించుకోవాలి?

ప్రజలలో స్వాతంత్ర్యఉత్సాహం ఉప్పొంగటంచేత రాజపాలనలను తిరగద్రోసారు. కాని వారు బహిరంగంగా నాస్తికదృష్టిని అంగీకరించడం లేదుగనుక వారిలో ప్రజాస్వామిక భావాలు దీక్షతో నిలువలేదు. అలవాటు పడిన ఆస్తికత్వంలోనికే దిగజారారు. బానిసత్వ లక్షణాలు బయటపడ్డాయి. ప్రభుత్వం నిరంకుశం అయింది. పేరుకు ప్రజాస్వామికాలయినా, ప్రజల ఆస్తిక భావాలవలన, ఈ ప్రభుత్వాలు నిజానికి నియంతృత్వాలుగా అయినవి. వీటిని నిజంగా ప్రజాస్వామికాలుగా చేయాలంటే ప్రజలలో నాస్తిక దృక్పథాన్ని పెంపొందించాలి. నాస్తికత్వాన్ని వారిచే బహిరంగంగా అంగీకరింప చెయ్యాలి. ఆనాడే నిజమైన ప్రజాస్వామికం ఆచరణలోనికి వస్తుంది. ప్రజాస్వామికాన్ని పోషించడానికి నేను నాస్తికత్వం ప్రచారం చెయ్యాలి.

ప్రజలలో నాస్తిక దృష్టివలన ఏర్పడిన ప్రజాస్వామికం ఏ విధంగా వుంటుంది.

## నాస్తికుని ప్రజాస్వామికం

ప్రజాస్వామికం అంటే ప్రజలే పరిపాలకులు కదా. పరిపాలకులు

ఎవరయినా బానిసలు గానూ, దాధలోనూ. వుండవానికి ఒప్పుకుంటారా? ఇది అసందర్భం. అటువంటప్పుడు ఈనాడు ప్రజాస్వామి కాలంలో కొందరు అస్పృశ్యులుగాను. కొందరు దరిద్రులుగాను ఎందుకు వుంటున్నారు నిజంగా ఈ అస్పృశ్యులకూ ఈ పేదలకూ పరిపాలనలో ప్రాముఖ్యము వుంటే, వారిని అణచిపెట్టి బాధించే ప్రభుత్వాన్ని వారు నిర్మించు కుంటారా?

కాని, ఈనాడు ప్రతి వయోజనునికి ఓటువున్నా. ప్రజలలో దారిద్ర్యం, బానిసత్వం వున్నాయి కనుక ఓటు వున్నంతమాత్రాన ఇది ప్రజాస్వామికం కాదని ఋజువగుచున్నది. ఓట్లవల్ల ప్రభుత్వవిధానాన్ని తారుమారు చెయ్యవచ్చునని సిద్ధాంతం ఉన్నప్పటికీ ఆచరణలో అది అంతగా జరగటంలేదు.

ప్రజల చేతుల్లో ఓటు ఉన్నంత మాత్రాన చాలదు. ఆ ఓటు వినియోగను కూడా తెలియాలి, ఉదాహరణకు నా చేతిలో తుపాకీ వుందనుకోండి. ఆ తుపాకీని పేల్చడం నాకు తెలియకపోతే నన్ను ఒక చిన్నపిల్లవాడు వచ్చి హింసించి పోవచ్చు. కాని నేను ఆ తుపాకీని వినియోగించినట్లయితే పదిమంది నా మీద పోరాటానికివచ్చినా ఎదుర్కొ గలను. చేతకానివాని ఆయుధంలాగే పేదవాని ఓటు ఈ రోజున ఉపయోగం లేకుండా పోతున్నది. పేదవాని ఓట్లు నిరుపయోగం అవడంచేతనే, ఈ ప్రభుత్వాలలో నిజానికి కొద్దిమంది ధనికులే పెత్తనం చేస్తున్నారు, వారికి అనుకూలంగానే పరిపాలన జరుపుకుంటున్నారు. చేతిలో అధిక ఓట్లు వుండికూడా పేరుకు పరిపాలకులై కూడా పేద ప్రజానీకం బాధల్లోనూ బానిసత్వంలోనూ పడిఉన్నారు.

పేదలు ఎందుచేత తమ ఓటును సద్వినియోగం చెయ్యడంలేదు? వారి కష్టనిష్ఠూరాలను తీర్చేది దైవం అనుకుంటున్నారుగాని, ప్రభుత్వవిధానం అని వారు గ్రహించలేదు. దైవారాధనలో తీసుకున్నంత శ్రద్ధ పరిపాలనా పద్ధతులు అర్థంచేసుకొనుటకు చూపుటలేదు. వారిఓటు

మొగమాటాల్లో పడిపోతున్నది. తమ ఓటు విలువలు వారు గ్రహించక పోవుటచేత రాజకీయంగా అది నిరుపయోగం అవుతున్నది. అందుచేత ఈనాటి ప్రభుత్వాలు పేరుకు ప్రజాస్వామికాలేగాని నిజానికి అవి ధనికుల నియంతృత్వాలు.

ఈ ప్రభుత్వాన్ని నిజంగాకూడా ప్రజాస్వామికాలుగా చెయ్యా లంటే ప్రజల దృష్టిని పరలోకంనుంచి ప్రభుత్వ విధానాలవైపు మరలిం చాలి. వారి సుఖదుఃఖాలు పరిపాలనా పద్ధతుల్ని అనుసరించి ఉంటాయని తెలియచెప్పాలి ఇది చెయ్యగలిగింది నాస్తిక దృక్పథమే. నాస్తికుల ప్రజాస్వామికమే నిజమైన ప్రజాస్వామికం.

నాస్తికుని ప్రజాస్వామికంలో సమానత వచ్చి తీరుతుంది, ఎందు కనగా ఏ పరిపాలకుడూ బానిసగా ఉండడానికి ఒప్పుకోడు. అందరూ తమతమ ఓటులను రాజకీయదృష్టితో వినియోగించుటచేత సమానతలకు అనుకూలమగు ప్రభుత్వ విధానాన్నే నిర్మించుకుంటారు.

నాస్తిక దృక్పధం ప్రజలకు అలవరచనిదే సమానత స్థాపించ వలెనంటే, ఆ ప్రభుత్వం కూడా నియంతృత్వ విధానం అవలంబిస్తుంది, సమానతా, ప్రజాస్వామికం కలసిరావాలంటే నాస్తిక దృష్టికావాలి,

## జిజ్ఞాస

నాస్తికదృష్టివలన నీతి అంటే ఏమిటో రాజకీయాలంటే ఏమిటో ముఖ్య సూత్రాలను గ్రహించుకున్నాను. అవి నా అనుభవానికి సరిపోతు న్నాయి. సాంఘిక జీవితంలో కూడ చక్కగానే వున్నాయి.

కాని అడుగడుక్కీ నిత్యజీవితంలో ఎదురొక్కంటున్న సమస్య ఇంకొకటి వుంది, అదేమిటంటే ఏది చూచినా, ఏది విన్నా ఇదిఏమిటీ

ఇది ఏమిటి? అనే ప్రశ్న. అవే విషయాలు తెలుసుకోవాలన్న జిజ్ఞాస. ఈ జిజ్ఞాస పెద్ద పెద్ద విషయాల్ని, చిన్న చిన్న విషయాల్ని అన్నింటినీ ఆవరించి ఉంటుంది. సూర్యుడేమిటి? చంద్రుడేమిటి? చావేమిటి? పుట్టుకేమిటి? ఒకరికి బాధలు ఏమిటి? కుంటీ గుడ్డీ ఏమిటి? వీదా సాదా ఏమిటి? అటువంటి ఎన్నెన్నో ప్రశ్నలు అనుక్షణం మనకు తడుతూ ఉంటాయి.

వీటన్నిటికి ఒకే మొండి సమాధానం నాకు చిన్నప్పుడు చెప్పారు. ఇదంతా దైవ సృష్టి అన్నారు. అదృష్టం, దురదృష్టం అన్నారు. పూర్వ జన్మ కర్మ అన్నారు. దైవం, కర్మలో నమ్మితే పై ప్రశ్న అన్నింటికీ సమాధానం వచ్చినట్లుంటుంది. ఏది అడిగినా అది దైవ సృష్టి అని చెబితే నాకు అదీ ఏదో తెలిసింది అనుకునేవాడిని. కాని ఆలోచిస్తే అది శుద్ధ పొరపాటని బైటపడుతుంది. దేనికైనా దైవసృష్టి, దైవమహిమ అని చెప్పే సమాధానం నిజానికి సమాధానం కానేకాదు. అది ప్రశ్నను అణచి పెట్టి, కప్పి పుచ్చడం. ఉదాహరణకు ఏదైనా అడిగితే "దైవానికే ఎరుక" అని జవాబివ్వటం అలవాటు. ఆ మాటకు అర్థం ఏమిటి? "దైవానికే ఎరుక" అంటే "నాకు తెలియదు" అని చెప్పడం అన్నమాట. "నాకు తెలియదు" అని స్పష్టంగా చెబితే ఇంకొక విధంగా తెలుసుకోడానికి ప్రయత్నిస్తాను, అంతేగాని "దైవానికే ఎరుక" అంటే దైవంలో నమ్మకం వున్నంతకాలం, నా జిజ్ఞాస అణచి పెట్టడం అయింది.

నాస్తికదృష్టి రాగానే, నా జిజ్ఞాస నిజమైన విజ్ఞానాన్ని సంపాదించడం ప్రారంభించింది. సూర్యుడూ, చంద్రుడూ, పుట్టుకా, చావూ, వీదా, సాదా, కుంటీ, గుడ్డీ విషయాలకు నాస్తిక దృష్టితో సమాధానం ఏమిటి?

# సాదృశ్యం

దైవసృష్టి, దైవ మహిమ అను నమ్మకాలను వదలివేస్తే నిత్యము చుట్టూ కనబడుతూన్న విషయాలు, అనుభవాల యొక్క అర్థం చెప్పుకోవడం యెలాగ?

ఒక విధానం సాదృశ్యం. సాదృశ్యమంటే పోలిక. సాదృశ్యంలో తనలాంటి వాళ్ళే అవతల కూడా ఉన్నారని అనుకోవడం ముఖ్యం. ఉదాహరణకు నా చిన్నతనంలో గ్రామఫోన్ పాటల్ని వింటూ వున్నప్పుడు ఆ పెట్లో ఎవరో కూర్చుని పాడుతున్నారని అనుకునేవాణ్ణి. చాలామంది పిల్లలకి నావలెనే ఇదే ఉద్దేశ్యము. వర్షం కురుస్తుంటే మేఘాల్లో ఎవరో కూర్చుని నీళ్ళు పోస్తున్నారని అనుకునే వాళ్ళం. ఇలాంటి సాదృశ్యమైన దృష్టి విజ్ఞానం పెంపొందే మొదటిదశలో చాలామందికి కలుగుతుంది. అటువంటి దృష్టి వలననే దేవతలు, దయ్యం అనే భావాలు కూడా ప్రజలలో కలుగుతాయి. కుండ చెయ్యడానికి కుమ్మరి వున్నట్లయితే ప్రపంచం చెయ్యడానికి ఎవరో వుండాలి అనుకుంటారు. అదే దేవుడనుకొంటారు. కాని, వర్షాకాలంలో నల్లటి మేఘాలు కొంచెం క్రిందుగానే వుంటాయి. ఒకొక్కప్పుడు చిన్న చిన్న కొండ శిఖరాల అంత ఎత్తుకూడా వుండవు. ఆ మేఘాల్లోంచి పైకి వెళతాం, ఆ మేఘాలలో వున్న రహస్యం అప్పుడు బైట పడుతుంది. అది వుత్తమంచు ఆవిరి వంటిది. అందులో మనుషులు ఎవరూ లేరు. ఈ రోజులలో విమానంలో పైకి ఎగురుతూన్నప్పుడు ఈ అనుమానానికి అసలే అవకాశంలేదు. ఎన్నో మేఘాల్లోంచి విమానం పైకి ఎగురుతోంది. అంత ఎందుకు? శీతాకాలంలో తెల్లవారుఝామున పొగమంచు మన చుట్టూ ఆవిరించి ఉంటుంది. నాలుగడుగులలో వున్నా ఒకరి కొకరు కనుపించరు. ఈ పొగమంచుకీ మబ్బులకీ తేడా లేదు.

ఈ విధంగా నా అనుభవం పెరుగుతూంటే, సాదృశ్యరీత్యా సంపాదించిన విజ్ఞానాన్ని పెరుగుతున్న అనుభవం బట్టి సరిదిద్దుకోవాలని తెలుస్తున్నది.

విజ్ఞాన సంపాదనకి ఇంకో విధానము ఏమిటంటే హేతువాదన. ఇది సాదృశ్యం కన్నా పదిరెట్లు కట్టుదిట్టాలలో ఈనాటి విజ్ఞానాన్ని కూడా బిగబట్టి వుంది. హేతువాదం అంటే ఏమిటి?

## దేవుణ్ణి సాదృశ్యరీత్యా మానవుడు సృష్టించాడు

సాదృశ్యం ద్వారా విషయ జ్ఞానం సంపాదించడం చాలా సులువైన విధానం. అందుచేతనే నాగరికత ప్రథమదశల్లోనూ, ఈనాడు కూడా చిన్నపిల్లల విషయాలు తెలుసుకోవడంలోనూ సాదృశ్యవిధానాన్నే అవలంబిస్తూ ఉంటారు. "క్రిందటి సంవత్సరంలాగే ఈ సంవత్సరం కూడా పంట లుండవచ్చు." అని ఆలోచించడం సాదృశ్యవిధానాన్ని అనుసరించి వుంది. "దానిలాగే, దానివలెనే" అనే మాటలు మనం మామూలు సంభాషణలలో విరివిగా వాడుతూ వుంటాం. అనగా ఆయా సందర్భాల్లో సాదృశ్యవిధానాన్ని అనుసరిస్తున్నాం.

సాదృశ్యంతోనే మొదటి దశల్లో మానవుడు దైవభావాన్ని ఏర్పరుచుకున్నాడు, అందుచేత ఆ రకంగా ఏర్పడిన దేవుళ్ళకూ దేవతలకూ మనిషిరూపం, మనిషిగుణాలు ఉండేవి. మనుషులు ఇళ్ళు కట్టుకుంటే దేవుడు ప్రపంచాన్నంటినీ సృష్టించాడని అనుకున్నారు. కనుక ఆ దేవుడికి మనిషి గుణాలే ఇంకా అధికబలంతో ఆరోపించారు. నాకు రెండు చేతులు వుంటే నా దేవునికి నాలుగుచేతులు. నేను కాలువలు త్రవ్వితే నాదేవుడు నదులను త్రవ్వాడు. నేను రాళ్ళగుట్టపెడితే, నా

దేవుడు కొండల గుట్టలు పెట్టాడు. ఇలాగ నాదేవుడుకూడా నావంటి వాడేగాని ఇంకా అధికబలం కలవాడు. నాగరికత పెరుగుదలలో విశేషంగా పురుషుడే ప్రధానపాత్ర వహించడంచేత. దేవుణ్ణికూడా సాదృశ్యపురీత్యా పురుషునిగానే చేసారు, అయితే ఆ దేవునికి మనిషిలాగే పెళ్ళాన్ని, పిల్లల్నికూడాఊహించారు, దేవునికి మానవ గుణాలయిన ప్రేమ, శాంతి మొదలయిన గుణాలేన్ని ఆరోపించారు.

ఈవిధం మానవులు సాదృశ్యరీత్యా దేవుడిని ఊహించడం గురించి ఒకకవి చక్కగా నిర్వచించాడు."ఒక వేళ ఎద్దుకనక దేవునిగురించి ఊహించగలిగితే ఆ దేవునికి రెండుకొమ్ములు ఉంటాయి." అన్నాడు. అనగా ఎద్దు సాదృశ్యరీత్యా దేవునిగురించి ఆలోచిస్తే, ఆ దేవుణ్ణి తన వలెనే తయారుచేస్తుంది. ఎద్దుకు రెండు కొమ్ములున్నాయి. కనుక ఎద్దుఊహించే దేవునికికూడా రెండుకొమ్ములను కల్పిస్తుంది. మానవుడూ అలాగే చేసాడు. అందుచేత దైవగుణాలన్నీ మానవ గుణాలే. అయితే ఆ కల్పనలో అతిశయోక్తులు ఉంటాయి.

మానవుడు ఊహించిన స్వర్గనరకాలూ ఈ విధంగా పోలికద్వారా ఏర్పడినవే. అందుచేత మానవుడు తన జీవితంలో ఏవైతే సౌఖ్యాలు అనుకున్నాడో వాటన్నిటినీ స్వర్గంలో చేర్చాడు. ఈ విధంగా ఒక్క భారతదేశంలోనేకాదు, చైనా, ఈజిప్టు, బాబిలోను అన్ని దేశాలలోను విజ్ఞానాభివృద్ధి మొదటిదశల్లో సాదృశ్యం మీదే ఆధారపడింది. అందుచేత వాళ్ళదేవుళ్ళుకూడా మానవరూపాలు, మానవగుణాలు కలవారే.

ఈదేవుడు వలెనే జీవాత్మఅనే భావంకూడా సాదృశ్యంద్వారా ఏర్పడింది.

తాను కొత్త స్థలాలను చూచివచ్చినట్లే రాత్రివేళ తనలోనుంచి ఒక భాగం ఎగిరివెళ్ళి కొత్త ప్రదేశాలు చూసి వస్తున్నదని అనుకొన్నాడు. అవే కలలు అనుకున్నాడు. ఇట్లాగానే జీవుడు అన్నాడు. బయటకు పోయిన జీవుడు తిరిగిరాకపోతే అదే మరణం అనుకున్నాడు. అందుచేతనే మరణానంతరం జీవునకు కర్మలూ, లడ్డీలూ పెట్టుట అలవాటు అయింది. ఈజిప్టుదేశంలో రాజు చనిపోతే అతని గుర్రాలను కూడా వెంటనే చంపేసేవారు. ఎందుకంటే రాజు యొక్క జీవుడు ఎక్క-డానికి గుర్రాల జీవుళ్ళు కూడా కావాలని వారి భ్రమ. హిందువులు గోదానం చేసే ఆచారం ఇటువంటిదే. చనిపోయినవారి జీవుడు వైతరణీ నదిని దాటి వెళ్ళడానికని గోవు జీవుడు సహాయం కావాలట. కొన్ని అడవి జాతులవారు గోరీలలో రొట్టెలు, పాలూ, సారాయి ఉంచుతారు. దప్పికగొన్న జీవుడు వచ్చి మామూలు మనుష్యుల వలెనే ఆ ఆహారాన్ని తింటాడని వారి ఊహ. దేవుళ్ళకు కూడా చాలభోగం, విశ్రాంతి. పవ్వళింపుసేవ చేస్తాము. ఇవన్నీ మనిషికి ఉన్న మామూలు అలవాట్లేకదా. వాటిని దేవుళ్ళకు జీవుళ్ళకు మనిషి తగిలించాడు. ఈ విధంగా మానవ జిజ్ఞాస ప్రథమ దశలో సాదృశ్య విధానాన్ని అవలంబించింది. దేవుడు, జీవుడు, స్వర్గం, నరకం- ఇవన్నీ ఈ విధంగా మనిషి తయారుచేసుకున్నవే. దేవుణ్ణి మానవుడు సృష్టించి, దేవునికి తనగుణాన్ని, తన రూపాన్ని, తన అన్నపానాదుల్ని తన వస్త్రాలంకారాల్ని ఆరోపించాడు.

కాని మేఘాల్లో మనిషిలేనట్టే సాదృశ్యరూపంగా ఏర్పడిన దేవుడు లేడని అనుభవంవలన తెలిసిపోతున్నది. అందుచేత మానవ జిజ్ఞాసలో రెండో విధానం అయిన హేతువాదనతో దైవనమ్మకను నిలబెట్టడానికి నాగరికత ప్రయత్నించింది.

## హే తు వా ద ం

నిజం తెలుసుకోడానికి ఇంకొక విధానం హేతువాదం. హేతువాదాన్నే కార్యకారణ నియమం అంటారు. అనగా ప్రతిపనికీ ఏదో

కారణం ఉంటుంది, కారణం లేకుండా కార్యం జరుగదు. కుండను తయారు చెయ్యాలంటే మట్టి. కుమ్మరి చక్రం కావాలి. ఇవన్నీ కుండకు కారణాలు. అలాగే పొగకు నిప్పుకారణము. అనారోగ్య మునకు మితిమీరిన జీవితరీతిగాని, వృద్ధాప్యముగాని కారణము కావచ్చు.

ఇట్లు కార్యకారణ దృష్టితో ఆలోచించడం చేత సాదృశ్య విధానంకంటె హెచ్చుసన్నిహితంగా విషయాల నిజాన్ని తెలుసుకోగలుగు తున్నాం. మనిషివంటి వరుణుడో, ఇంద్రుడో మేఘాల్లోకూర్చుని నీరుపోస్తూ వుంటే వర్షం కురుస్తున్నదని సాదృశ్యరీత్యా అనుకున్నాం అందుకనే వర్షసమయంలో పంచరంగుల ధనురాకారం (విల్లువలె) ఆకాశంమీద కనపడగానే దానిని ఇంద్రధనస్సు అన్నారు. కాని ఈ రోజున హేతువాదనరీత్యా వర్షంయొక్క యదార్థాన్ని ఇంకొకలాగ అర్థంచేసుకుంటున్నాం. చెట్ల ఆకుల్లోంచి, సముద్రాలు చెఱువులలోనుంచి నీరు ఆవిరై పైకి పోతున్నది. ఆ ఆవిరే మేఘాలుగా చేరుతున్నది. అది చల్లబడి వర్షంగా కురుస్తున్నది. వర్షంకురిసిన తర్వాత నీటితుంపరులు గాలిలో ఉన్నప్పుడు ఆ బిందువుల్లోంచి సూర్యకిరణాలు ప్రసరించి ఏడు రంగులుగా విభజింపబడతాయి. ఆ రంగులనే మనం చూస్తున్నాం. అదే ఇంద్రధనస్సు. మనచూపు ఎంత దూరంపోతుందో ఇంద్రధనస్సు అంతదూరంలో వుందె. ఇట్లు వర్షం గురించి ఆలోచిస్తే ఆవిరిమేఘాలకు కారణం. మేఘాలు వర్షానికికారణం, నీటితుంపరులు ఇంద్రధనస్సుకు కారణం. ఒకదానికొకటి సరిపోతున్నది. ఇంద్రధనస్సు ఎప్పుడూ ప్రొద్దున్నో సాయంత్రమో కనపడుతుందిగాని మధ్యాహ్నం ఎన్నడూ కనిపించదు. ఎందుకంటే సూర్యకిరణాలు ఏటవాలుగా నీటిబిందువులలో నుంచి వెళ్ళితేనే మనకు ఆ ఏడురంగులూ కనిపిస్తాయి. మరియు సూర్యునికి ఇంద్రధనస్సు ఎదురుగా వుంటుంది. అనగా వుదయం పడమరనూ, సాయంత్రం తూర్పుననూ వుంటుంది. వీటన్నిటికీ కారణాలు చెప్పవచ్చు.

ఈ విధంగా హేతువాదనరీత్యా ఆలోచిస్తే ఎన్నో విషయాలు మనకు తెలుస్తున్నాయి. భౌతికశాస్త్రాలు, తర్కం, పరిణామసిద్ధాంతం అన్నీ హేతువాదనమీద ఆధారపడి వున్నవి.

సాదృశ్యరీత్యా దైవాన్ని కొట్టివేసినా హేతువాదంతో దైవాన్ని నిలబెడుతున్నారు. "ప్రతి దానికి ఏదో ఒక కారణం వుండాలికదా. ఈ ప్రపంచానికి కారణం దైవం" అంటారు. అందుకనే దేవుడికి సృష్టికర్త అని పేరు పెట్టారు. అటి దైవానికి ఏదైనా గుణం ఆరోపించినా, ఆరోపించక పోయినా అది ఏదో ఒక మూలశక్తి లేక మూలపదార్థం అంటారు ఆదే ఇన్ని విధాలుగా మారి, ఈ కనబడే ప్రపంచ మంతా తయారయింది అంటారు. ఇతర రకాల దేవుళ్ళని ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఏదో ఒక మూలశక్తి లేక పదార్థం మూలం అనడంలో చాలామంది శాస్త్రజ్ఞులు మేధావులు ఏకీభవిస్తారు. ఆ మూల విషయం యొక్క గుణగణాలను గురించి అభిప్రాయభేదాలున్నాయిగాని అది లేదని మాత్రం వారు అనరు.

ఏమీ చెప్పలేకపోతే "నిర్గుణము" "అవాఙ్మానసగోచరం", "అనిర్వచనీయం" అని తప్పుకుంటారు గాని, మూలకారణమగు శక్తో, పదార్థమో లేదనరు.

ఈవిధంగా సాదృశ్యం సరిపోకపోయినా హేతువాదనతో దైవాన్ని సమర్థిస్తారు.

కాని సూక్ష్మంగా పరిశీలిస్తే హేతువాదనలో లోపాలు వున్నాయి. అవిఏవి ?

## హేతువాదంలో లోపాలు

హేతువాదం అంటే ప్రతి పనికి కారణం ఏదో వుందనడం. కారణం లేనిదే కార్యం లేదు. ప్రతి కారణం దాని వరుసలో మళ్ళా కార్యం అయినట్లే, ప్రతి కార్యం దాని వరుసలో ఇంకొకదానికి కారణం అవు

ఉంది. ఉదాహరణకు మేఘాలు వర్షాలకు కారణం. వర్షాలు పంటలకు కారణం, పంటలు ఆహార సమృద్ధికి కారణం. ఆహార సమృద్ధి దేశ శాంతికి కారణం, దేశశాంతి మానవతావృద్ధికి కారణం. ఈ విధంగా ఒక గొలుసుమాదిరి ఒకదానికి ఇంకొకటి కారణంగా లంకె వేసుకుంటూ పోవచ్చు. ఈ సందర్భములో పంటలు తీసుకుందాం. మేఘాలతో పోలిస్తే పంటలు కార్యం అవుతాయి, అనగా మేఘాలనే కారణం వలన వర్షాలు అనే కార్యం జరుగుతుంది. కాని పంటల్ని ఆహార సమృద్ధితో పోలిస్తే, పంటలు మళ్ళా కారణ మయింది ఎందుకనగా పంటలు కారణంగా ఆహారసమృద్ధి అను కార్యం జరుగుతుంది. ఇట్లు, ఒకే పని ఒకదానికి కార్యం అవుతుంది, ఇంకొకదానికి కారణం అవుతుంది, హేతువాదనలో ఇట్టి కార్య కారణ వరుస ఉండుట హేతువాదన యొక్క లక్షణం. ఈ వరుసలో వెనక్కు వెళ్ళినా, ముందుకు వెళ్ళినా హేతువాదన యొక్క లోపాలు స్పష్టపడుతాయి

వెనక్కు వెళ్ళి చూద్దాం. మన జన్మకు కారణం సృష్టి. సృష్టికి కారణం పంచ భూతాలు, పంచభూతాలకు కారణం అడిగితే అవి సహజం అంటాము. లేదా పంచ భూతాలకు ఏదో శక్తో, పదార్థమో, దైవమో కారణం అంటాము. ఆ శక్తికి, ఆ పదార్థానికి లేక ఆ దైవానికి కారణం ఏమిటంటే, దానికి కారణం లేదు; అది అనాది (కారణం లేనిది)అంటారు హేతువాదనలో ప్రతి కార్యానికి కారణం ఉండాలని ఒప్పుకుంటే, దైవానికి కారణం కావాలి గదా? ఏదైనా సహజం, అనాది అనటం హేతువాదనలోని లోపము కాదా? ఎక్కడో పంచభూతాల వరకు వెళ్ళి సహజం అనే బదులు మన పుట్టుకే సహజం అనరాదా? కాని నా పుట్టుకకు నా తల్లి తండ్రులు కారణంగా కనపడుతున్నారు కనక అది సహజం అనకుండా కారణం చెప్పాను. నా తల్లిదండ్రులు, తాతలపైన పంచభూతాలను కారణాలుగా ఊహించాను. పంచభూతాలకు మూలశక్తినో, మూలపదార్థాన్నో

ది వాన్నే కారణంగా కల్పించాను. ఆపైన ఇక నా హేతువాదంలోని లోపాల్ని కప్పిపుచ్చలేక పోయాను. హేతువాదములోని లోపము బైటపడిపోయింది. అందుచేత శక్తో పదార్థమో అనాది (కారణం లేనిది) సహజమంటూ తప్పుకో ప్రయత్నించాను. కాని అనాది సహజం అనే మాటలు హేతువాదన లోపాలను తెలుపుతాయే గాని దాని బలాన్ని కాదు.

ఈ విధంగా వెనక్కి వెళ్లటచే హేతువాదనలోని లోపం బయట పడింది. ఇక కార్యకారణ వరుసలో ముందుకు వెళ్ళి కూడా పరీక్షించి చూద్దాం.

## హేతువాదంలో మరో లోపం

ఒక కారణం వెంబడి ఇంకొక కారణం వెతుక్కుంటూ వెనక్కి వెళ్ళితే ఎక్కడో ఒకచోట అనాది అనవలసి వస్తున్నది. అనాది అంటే కారణం లేనిది అన్నమాట ప్రతిదానికి కారణం వుంటుందని ఒకవైపున హేతువాదం చెప్తూ, రెండవవైపున "ఇది అనాది" అని చెప్పుకోవడం వాదంలో లోపంగా నేను తెలుసుకున్నాను.

వెనక్కివెళ్ళితే అనాది వలెనే ముందుకు వెళ్ళితే ఇంకాలోపం హేతువాదంలో కనపడుతుంది.

మేఘాలు, చల్లనిగాలులు ఇంకా ఏవోకారణాలవల్ల వర్షం అనే కార్యం జరుగుతుందంటారు. వర్షం కురవడానికి ఎన్ని కారణాలైనా వుండవచ్చు. అన్నీ నాకు తెలియక పోవచ్చు. నాకు తెలియనంత మాత్రాన అవి లేవనడానికి వీలులేదుకదా. నిప్పుమీద తెలిసి చేయివేసినా కాలుతుంది, తెలియక చేయివేసినా కాలుతుంది. అలాగే వర్షంకురవడానికి నాకు తెలిసినా తెలియకపోయినా కొన్ని కారణాలున్నాయని హేతువాదం చెబుతుంది. ఆయా కారణాల సమిష్టి ఫలితమే వర్షం. ఈ విధంగా ఒప్పు

కుంటే వర్షం అనే కార్యం జరగడం ముందుగా నిర్ణయింపబడి వుంది అని కూడా ఒప్పుకోవాలి. ఎందుకంటే కార్యంకిన్న కారణాలు ముందు వుంటాయి. కారణాల సమిష్టి ఫలితంగా కార్యాలు జరుగుతాయి, అటు వంటప్పుడు నేను హేతువాదాన్ని ఒప్పుకుంటే,వర్షం అనేకార్యం ముందుగా నిర్ణయింపబడి వుందని కూడా ఒప్పుకోవాలి.

ఇలాగే ప్రతీ కార్యం గురించికూడా. మనిషిప్రవర్తనలో మంచి విషయమైనా, చెడ్డ విషయమైనా ప్రతీ విషయమూ ముందుగా నిర్ణయింప బడి ఉన్నదనికూడా హేతువాదన ఒప్పుకొన్నవాళ్ళు, ఒప్పుకోవలసి వస్తున్నది. ప్రతికార్యమూ నిర్ణయించబడి వున్నదనటమే కర్మసిద్ధాంతము. జాతకాలు, సాముద్రికాలు, పూర్వజన్మ – ఉత్తరజన్మలలో నమ్మకాలు, అదృష్టంలో నమ్మకం – ఇవన్నీ హేతువాదన రీత్యా ఏర్పడిన కర్మసిద్ధాంతమువలన ఏర్పడినవి.

కాని నా నిత్యజీవితంలో క్షణక్షణ అనుభవం కర్మ సిద్ధాంతానికి హేతువాదన సారాంశానికి వ్యతిరేకంగా కనపడుతున్నది. ఇవి ముఖ్యంగా రెండు, ఒకటి : భవిష్యత్తు. రెండు : నీతి.

హేతువాదనబట్టి మొన్నటివలన నిన్న. నిన్నటివలన ఇవాళ ఇవాళవలనరేపు, రేపువలన ఎల్లుండి ఇలాగ నిర్ణయింపబడి ఉండాలి, ఇలాగ భవిష్యత్తులో జరగవలసిన విషయాలన్నీ నిర్ణయింపబడి వుండాలి. ఇటువంటి ఆలోచనను అనుసరించే "ఏది ఎలాగ జరగవలసిఉంటే అలాగ జరుగుతుంది" అని సాధారణంగా మాటవరుసకు వ్రాస్తారు. కాని నా నిత్యానుభవము ఇంకోలాగ ఉంది. "ఏది ఎలాగ జరగవలసిఉందో అలాగ జరుగుతుంది." అని నేను నిజంగా నమ్మితే నేను దేనికీ ప్రయత్నమే

చేయను. జరగవలసివుంటే పనులు జరుగుతూవుంటే నేను ఇంక చేయవలసిన అవసరమేముంది? ఇటువంటి ఆలోచనవల్లనే కర్మసిద్ధాంతం నమ్మినవారు చాలా భాగం కాళ్ళు జాపుకుని కూర్చుంటారు. కర్మసిద్ధాంతాన్ని నమ్మిన 30 కోట్ల హిందువుల్లో చాలా స్తబ్దత కనబడుతూనే వుంటుంది. సిద్ధాంతంబట్టి స్తబ్దులుగా ఉన్నా ప్రతివాడు, కొద్దిగానో, గొప్పగానో ప్రయత్నం చేస్తూఉంటాడు. భవిష్యత్తు నిర్ణయింపబడలేదనీ, నేను దానిని సాధించుకోగలననీ నా అనుభవంలో ఉండబట్టే నేను దేనికయినా ప్రయత్నము చేస్తాను. ఒక కార్యము నిర్ణయింపబడి ఉంటే నేను దానిని సాధించుటకంటూ ప్రయత్నం చేయడం వెర్రితనం కాదా? అది నిర్ణయింపబడి లేదుకనుకనే నేను ప్రయత్నం చేస్తున్నాను.ఏది ఎలాగ జరగవలసిఉందో అలాగ జరుగుతుందని మాటవరుసకు నేను అంటున్నా, నిజానికి నా ప్రయత్నాలవలన నేను కార్యాల్ని సాధించుకొంటున్నాను. భవిష్యత్తు నిర్ణయింపబడలేదని చూపించటానికి నా నిత్యప్రయత్నమే ఋజువు. ఇట్లుభవిష్యత్తు నిర్ణయింపబడి ఉందని హేతువాదన చెప్పే సారాంశం తప్పు. హేతువాదనలో ఉన్నలోపం వల్లనే ఈ సారాంశం వచ్చింది.

హేతువాదనే సరియైనది అయితే నీతి, అవినీతి అనేమాటలు అర్థహీనం అయిపోతాయి. ఒకడు దొంగతనం చేస్తే అది దొంగయొక్క తప్పిదం అని చెప్పడానికి వీలు ఉండదు. ఎందుకంటే వాడు దొంగతనం చేయవలసిఉంది కనక చేశాడు అనవచ్చు. అప్పుడు దొంగతనానికి బాధ్యత దొంగతనాన్ని చేయించిన కారణాలది అయి ఉంటుందికాని, దొంగది అవదు. అట్లయితే దొంగని శిక్షించకూడదు కదా!

ఈ విధంగా హేతువాదాన్ని ఒప్పుకొంటే నీతి లేదు, అవినీతి

లేదు. మంచిగాని: చెడ్డగాని జరగవలసి ఉందికనక, జరుగుతున్నదని ఎవ రినీ ఏమీ అనకుండా కూర్చోవాలి. కాని నిత్య జీవితంలో మన అనుభవం అదికాదు. నీతిని పెంపొందించడానికి, అవినీతిని నిరోధించడానికి ప్రయత్నం చేస్తూనే వున్నాం. నీతినియమాల్ని మనం ఏర్పరచుకుంటు న్నాము. వాటిని సరిదిద్దుకుంటున్నాం. ఇది హేతువాదన సారాంశానికి వ్యతిరేకం కాదా?

హేతువాదంలోని లోపాన్ని కప్పిపుచ్చడానికి అక్కడ అనాది అయినట్లే ఇక్కడ పురుషప్రయత్నంకూడా ఉందంటారు. ప్రతికార్యము కారణబద్ధమై వున్నట్లయితే; మళ్ళా పురుషప్రయత్నం అంటూ ఒక మినహాయింపుని ఎందుకు ఒప్పుకోవలసి వచ్చింది? పురుషప్రయత్నాన్ని అంగీకరించడం హేతువాదాన్ని బలపరచే బదులు దానిలోని లోపాన్ని ఎత్తిచూపుతున్నది.

ఈ విధంగా ఒక పైపున అనాది. రెండోవైపున పురుషప్రయత్నం హేతువాదనలోని లోపాన్ని బయట పెడుతున్నాయి. కాని మన వాడుక భాషలో "కాబట్టి, అందుచేత, దాని వలన" మొదలైన కార్యకారణ సంబంధాల్ని సూచించే మాటల్ని వాడుతూ ఉంటాం. హేతువాదన తప్పు అయినట్లయితే ఈ మాటలను ఎందుకువాడతాం?

## వాస్తవిక వాదన

సూక్ష్మంగా పరిశీలిస్తే హేతువాదనలో లోపాలున్నట్లు గ్రహించు కొన్నాను. హేతువాదనలో లోపాలుంటే, భాషలలో "కాబట్టి" "అందు" ఇటువంటి మాటలు చాలా వాడుతున్నాను కదా అది తప్పుకదా అన్న ఆలోచన నాకు వచ్చింది. దీనికి సమాధానం ఏమిటి?

జ్ఞానాన్ని రెండురకాలుగా నేను సంపాదించు కుంటాను, ఒకటి:

ప్రత్యక్షంగా నేను చూచి తెలుసుకొనిన విషయాలు; రెండు; నేను చూడక పోయినా, ఇతర విధాలుగా సంపాదించుకొన్న విషయాలు. నిజానికి మొదటి రకంకన్న ఎన్నోరెట్లు రెండవరకం జ్ఞానమే అధికం. పుస్తకాలు చదివి గ్రహిస్తాను; ఆప్తులు చెప్పిన మాటలను నమ్ముతాను; సాంప్రదాయకంగా వచ్చే అభిప్రాయాల్ని ఒప్పుకుంటాను; నా పూర్వానుభవాన్ని పురస్కరించుకొని ఒకదానితో ఒకటిపోల్చి, సాదృశ్యరీత్యా ఇలాగ వుంది వుండవచ్చునని కొన్ని విషయాలను గ్రహిస్తాను; హేతువాదనతో విషయాలను ఊహిస్తాను. ఇన్ని విధాల నాకు అప్రత్యక్ష జ్ఞానం ఎంతో ఉంటుంది ఒక్కొక్క విధంగా వచ్చిన విషయాల్ని వివరించేటప్పుడు వాటికి సంబంధించిన మాటలు కూడా వాడుతాను. ప్రత్యక్ష అనుభవం చెప్పినప్పుడు నేను స్వయంగా చూచానండీ, అంటాను. అప్రత్యక్ష విషయాలగురించి చెప్పేటప్పుడు "నేను దాని గురించి ఫలానా గ్రంథంలో చదివేను" "ఇది ఎంతో కాలం బట్టి ఆచారంగా వస్తున్నది," "దాని వలెనే ఇది కూడా ఉంది." "దాని వల్ల ఇది జరుగుతుంది;" "నాకు వాళ్ళు చెప్పారు" ఈ విధంగా వ్యవహరిస్తూ వుంటాను. ప్రత్యక్ష జ్ఞానమే ప్రతివారికి హెచ్చుగా వుంటుంది కనుక. అప్రత్యక్ష జ్ఞానాన్ని ఏరీతిగా సేకరించారో దానికి సంబధించిన పదాలను భాషలో వాడుతారు. పుస్తకాల ద్వారానే గ్రహిస్తే, ఆ గ్రంథములో అలాగ చెప్పి వుంది, ఈ గ్రంథములో ఇలాగ చెప్పివుంది. అంటూ వుంటారు "పెద్దలు చెప్పినట్లు" అని విస్తారం వాడుతారు ఇది ఆచారం అంటారు మరికొందరు. 'కాబట్టి' "అందుచేత" అని వాడితే ఆ అప్రత్యక్షజ్ఞానం హేతువాదన వలన సేకరించబడింది అన్నమాట.

ఏ విధంగా అప్రత్యక్షజ్ఞానం సంపాదించినా, అది ఎంతవున్నా, ప్రత్యక్షజ్ఞానానికి ఇచ్చినంత విలువ అప్రత్యక్షజ్ఞానానికి ఇవ్వడానికి వీలు

లేదు. అయితే అప్రత్యక్షజ్ఞానమే హెచ్చువడం చేత మానవనడవడి విశేషంగా దాని మీదనే ఆధారపడి ఉంటుంది. సక్రమంగా నడవడి సాగుతున్నంత కాలం అప్రత్యక్షజ్ఞానం గురించి అనుమానించ వలసిన అవసరం లేదు. కాని దానిలో ఏ సందేహం వచ్చినా ప్రత్యక్షంగా నిర్ధారణ చేసుకోవలసిందే. ఇదే వాస్తవిక వాదం. నాస్తిక విధానం వాస్తవిక వాదం.

వాస్తవికవాదం వలన శుష్క వివాదాలకు తావులేదు సరికదా, ఎప్పటికప్పుడు యదార్థంవైపు పురోగమిస్తూ ఉంటాం. ఎందుకంటే, వాస్తవికవాద దృష్ట్యా అప్రత్యక్ష విషయాలగురించి వాదన రెండువిధాల అనవసరం. అప్రత్యక్ష విషయంమీద అభిప్రాయభేదం వస్తే, దానిని నిర్ధారణ చేసి కొనుటకు వీలుంటే, వాదన అనవసరం. నిర్ధారణ చేసుకొని సత్యాసత్యాలు తెల్సుకోవచ్చు. నిర్ధారణ చేయుటకు వీలులేని విషయం అయితే, అది ఉత్త ఊహామాత్రపు సిద్ధాంతం. దాని గురించి ఎవరి అభిప్రాయం వారిది. వాదన ఎందుకు? ఇది వాస్తవికవాదం విశిష్టత.

వాస్తవిక వాదనరీత్యా సృష్టి మొదలైన ప్రశ్నలకు సమాధానం ఏమిటి?

వాస్తవిక వాదం వలన అన్ని అనుమానాలూ. అన్ని అభిప్రాయ భేదాలూ తీరిపోయాయి. ఎందుకంటే మానవజ్ఞానంలోని రెండు భాగాల్నీ వాస్తవిక వాదం గుర్తిస్తుంది. ప్రత్యక్షం అప్రత్యక్షం. అప్రత్యక్షజ్ఞానం ఎంత హెచ్చుగా వున్నా, అవన్నీ ఊహలూ, సిద్ధాంతాలూ. అవి సాదృశ్య ద్వారా ఏర్పడవచ్చు. హేతువాదన ద్వారా ఏర్పడవచ్చు. లేకపోతే గ్రంథప్రమాణం, ఆప్తవాక్యం, సంఘాచారం దేనిద్వారానైనా ఏర్పడవచ్చు. ఏ విధంగా ఏర్పడినా సరే అప్రత్యక్షజ్ఞానమంతా ఊహలూ లేక సిద్ధాంతాలూ. వాటిమీద అభిప్రాయ భేదాలతో తగాదాపడి కార్యం లేదు. ఆ సిద్ధాంతాల సారాంశాలను ప్రత్యక్షంగా నిర్ధారణ చేసికోగలిగితే

వాదనల్లోని నిజానిజాలు తేలిపోతాయి. అప్పుడు తగాయిదా అవసరం లేనేలేదు.

ఉదాహరణకు శరీరంలోనుంచి జీవాత్మ వెలికిపోవుటచేత మరణం తటస్థిస్తుందని నమ్మిన రోజులలో చనిపోయినచేప నీటిలోమునుగుతుందా తేలుతుందా అని పండితులు వాదించడం మొదలు పెట్టారట. జీవాత్మ పోయింది కనక శరీరం తేలికై, చనిపోయిన చేప నీటిపైన తేలిపోతుందని ఒకపక్షం వాదన. జీవాత్మకు బరువులేదు. కాని జీవాత్మలేనందున చైతన్యరహితంకాగా ఈదలేదు కనుక చనిపోయిన చేప నీటిలో మునిగిపోతుందని ఇంకొక పక్షం వాదన. ఇట్లు ఆ పండితులు వాదిస్తూ కూర్చున్నారేకాని ఒక చనిపోయిన చేపను కుండెడు నీళ్ళల్లోవేసి పరిక్షిస్తే నిజము తెలిపేది కదా. ఇట్లు చర్చల సారాంశాలను ప్రత్యక్ష పరీక్షతో నిర్ధారణ చేసుకోవడమే వాస్తవిక దృష్టి. వాస్తవిక విధాన్ని అవలంబించకుండా ఎంత వాదించుకున్నా అభిప్రాయ భేదాలు తీరవు.

ఇక కొన్ని చర్చల సారాంశాలు నిర్ధారణకు తిన్నగారావు. ఉదాహరణకు సృష్టివిషయం. సృష్టిఎలాగవచ్చింది? సృష్టికి కారణంఏమిటి? సృష్టి వుద్దేశ్యం ఏమిటి? అంటూ చాలా ప్రశ్నలు వేస్తారు. వీటి గురించి చర్చోపచర్చలు సాగిస్తారు. సాదృశ్యం, హేతువాదన, ఆప్తవాక్యం, సాంప్రదాయం, గ్రంథలిఖితం మొదలైన ఆధారాలతో ఎన్నో సిద్ధాంతాలు చెబుతారు. అయితే ఇవన్నీ అప్రత్యక్షపు ఊహలే అని గుర్తించాలి. ఏ వైనా తిన్నగా నిర్ధారణ చేసికోగలిగితే ఇన్ని వాదనలు, సిద్ధాంతాలూ అనవసరం కాదా? ఇటువంటి ఊహలతో వాదనలు సలుపుతూ, ఒకరిపై ఒకరు రోషాలూ, కావేశాలూ పెంచుకోవడం మూఢత్వం, అవివేకం అవుతుంది.

సృష్టికి సంబంధించినంతవరకు కొన్ని సారాంశాలను నిర్ధారణ చేసికోవచ్చు. సృష్టికి మూలం దైవం అని, ఆ దైవమునకు సర్వసృష్టి స్థితి

లియశక్తి కలదనియు ఒక సిద్ధాంతం. దీనిని ఒప్పుకుంటే మానవునికి వేరే వ్యక్తిత్వం వుండదు. కాని వ్యక్తిత్వము అనుక్షణానుభవము కనుక, యదార్థమునకు పై సిద్ధాంత సారాంశము వ్యతిరేకముగా వున్నది. అందు చేత ఆ సిద్ధాంతము తప్పు అని నిర్ధారణ చేసుకొనవచ్చు. ఇట్లు వాస్తవిక వాదరీత్యా పరీక్షించి చూస్తే దైవము అబద్ధం అవుతుంది.

ప్రత్యక్ష అప్రత్యక్షజ్ఞానాలకు గల తారతమ్యాలను వాస్తవికవాదం గుర్తించి దేనికివ్వవలసిన స్థానం దాని కిస్తుంది.

ప్రత్యక్షజ్ఞానానికి ఇవ్వవలసిన ప్రాముఖ్యత అప్రత్యక్ష జ్ఞానానికి ఇవ్వబట్టి మతనమ్మకలపేరిట ద్వేషాలూ, అంధవిశ్వాసాలూ పెరిగాయి, వాస్తవికవాదం ఈ పొరపాట్లను తొలగిస్తుంది.

ప్రత్యక్షజ్ఞానానికీ. అప్రత్యక్షజ్ఞానానికీ తేడా తెలిసికోవడమే వాస్తవిక వాదంయొక్క ముఖ్యగుణం. అప్రత్యక్షజ్ఞానాన్ని మనం ఏ విధంగానైనా సంపాదించవచ్చు. దానిలో అపేక్షణలేదు. నిజానికి మన విజ్ఞానంలో చాలా భాగము అప్రత్యక్షజ్ఞానమే. వినికిడి వలన, ఊహవలన ఎన్నో విషయాల గురించి విజ్ఞానం సంపాదిస్తాం. కాని అదంతా అప్రత్యక్షజ్ఞానం అని స్పష్టంగా గుర్తించాలి. మన అప్రత్యక్షజ్ఞానంలోని ప్రతి అంశాన్ని నిర్ధారణ చేసుకోవలసిన అవసరం సాధారణంగా వుండదు. నమ్మకమీద పోతూవుంటాం కాని. ఏ విషయం మీదనైనా అనుమానం వచ్చినపుడు మాత్రం దానిని నిర్ధారణ చేసుకోవలసిందే.

మరియు నేను నమ్మాను అని ఎవరూ కూర్చోడానికి వీలులేదు. సంఘ నిర్మాణంలో ఏకాభిప్రాయం విషయజ్ఞానం మీద ఆధారపడి వుంటుంది; అందుచేత నేను నమ్మిన విషయాన్ని మీరు కూడా నమ్మితే సరేసరి, లేకపోతే నిర్ధారణలో ఋజువు చేయవలసిన అవసరం నా మీద వుంటుంది. నిర్ధారణ చేయనంత పేహూ అనుమానం వున్న అంశాలను

ఎవరి అభిప్రాయం వారిదని అంగీకరించి ఊరుకోవాలి. అట్లుకాక అభిప్రాయ భేదాన్ని తొలగించి ఏకాభిప్రాయాన్ని సంపాదించాలంటే, అనుమానం వున్న విషయాన్ని నిర్ధారణ చేసికోవాలి. ఉదాహరణకు శకునాల వలన పనులలో ఫలితాలు లభిస్తాయంటారు. అదే నిజమైతే ఎవరు ముట్టుకున్నా నిప్పు కాలినట్లు ఎవరికి దుశ్శకునం ఎదురైనా వారి పని భగ్నం కావలసిందే. మంచి శకునం వస్తే వారి పని ఫలించవలసిందే. ముహూర్తాల విషయం కూడా అంతే. శకునాలలోను, ముహూర్తంలోను నిజంగా బలం వుంటే ఆ ముహూర్త ప్రభావం కాని, ఆ శకున ప్రభావంకాని అందరిమీద ఒకేలాగ ఉండవలసిందే. కాని వేరు వేరు ప్రాంతాలలోను, వేరు వేరు మతాలలోను ఒకే ముహూర్తాన్ని కొందరు మంచి అనడం, కొందరు చెడ్డ అనడం మనం చూస్తూనే వున్నాం. ఒకరికి అమావాస్య మంచిది అయితే, ఇంకొకరికి చెడ్డది. ముహూర్తాలు, శకునాలు అర్థవిహీనం అయినవని ఋజువు చేయుటకు ఈ రకరకాల ఆచరణలే నిర్ధారణ. సంఘాచారాల వలన, వినికిడి వలన కలిగిన అప్రత్యక్ష జ్ఞానమే ఈ శకునాలలో నమ్మకం. వాటిని ఆచరణలో పోల్చిచూసి అవి అబద్ధాలని తెలుసుకున్నాను. ఇదే వాస్తవిక వాదం.

అప్రత్యక్ష జ్ఞానాన్ని గ్రహించే వివిధరీతులలో హేతువాదన మేధావులను చాలా ఆకర్షిస్తుంది. సామాన్య ప్రజయొక్క నమ్మకాలు సాంప్రదాయ ప్రవాహాన్ని అనుసరించి పోతూవుంటే, మేధావులు విషయాలను గురించి బాగా తర్కిస్తారు. ఆచార వ్యవహారాలను ఆచరణతో పోల్చిచూసి నిజానిజాలను వాస్తవిక దృష్ట్యా ఎలాగైతే తేల్చుకుంటామో, అదే రీతిగా తర్కసారాంశాలలోని నిజానిజాలనూ తేల్చుకోవాలి. కాని మేధావులు ఇటువంటి వాస్తవిక దృష్టిని అనుసరించరు. వారు తర్కంలోకే దిగుతారు. అటువంటప్పుడల్లా వారి విజ్ఞానం తప్పుదారిని పడుతూ వుంటుంది. ప్రతిదానికి ఏదో ఒక కారణం వుందను పొరపాటు అభి

ప్రాయం మీద తర్కం ఆధారపడి వుంది. ఆ హేతువాదనలో ఏ లోపా లున్నాయో ఇదివరలో పరిశీలించాం. నిజానికి దేనికీ కారణం లేదు. కాని పరస్పర సంబంధంలో చాలా విషయాలు జరుగుతున్నప్పుడు మొత్తం మీద వాటిని కార్యకారణ వరుసలో ఆలోచనా సౌకర్యం కొరకు మనమే పెట్టుకుంటున్నాం. కార్యకారణ సంబంధం మనం కల్పిస్తున్నదే కాని అది అసలు విషయాలలో లేదు. అనేక విషయాల యొక్క మొత్తపు అభిప్రాయాన్ని సగటు ఎలా తెలియజేస్తుందో, కార్యకారణ సంబంధమూ అంతే. అది ప్రతివిషయానికి దరిదాపుగా వుంటుంది కాని, ఏ ప్రత్యేక విషయానికీ పూర్తిగా సరిపోదు. ఉదాహరణకు జోళ్ళషాపులో ఏదో కొలత చెప్పు నా కాలుకు సరిగ్గా సరిపోయినట్లు నాకు తోచవచ్చు. కాని నిజానికి నా కాలు కొలత చూసి కుట్టిన జోడు కాదు. మొత్తంమీద మనుషుల పాదాల కొలతకు సంబంధించి ఎన్నో జోళ్ళు తయారుచేస్తే అందులో ఒక కొలతకు నా పాదాన్ని సరిపుచ్చుకొన్నాను. ఇదే విధంగా విషయాలను తీసుకు వెళ్ళి మనం కారణాలకు సరిపుచ్చుతున్నామే కాని, నిజముగా వాటికి కార్యకారణ సంబంధం లేదు. అందుచేత తర్కసారాంశాలుకూడా అప్రత్యక్ష జ్ఞానమే. వాస్తవిక దృష్టిలో వాటిని ఆచరణతో పోల్చి చూచు కొనవలసిన అవసరం ఉంది.

## దైవం అబద్ధం, అనవసరం

ఉగ్గుపాలతో నా తల్లిదండ్రులు నాకు అలవాటు చేసిన దైవ విశ్వా సము రాను రాను నా అభివృద్ధికి అడ్డుపడింది.

నేను ఏదైనా పని తలపెడితే, దానిని కృషిచేసి నేను సాధించు కోవాలా, లేక "దైవం ఎలాగ తలచాడో: "నా నుదుట ఎలాగ వ్రాసి వుందో:" అని వేచి వుండి కూర్చోవాలా? నాకృషి నేను చేసుకుంటే నాకు ఇక దైవంతో అవసరం ఏముంది? అంతేకాదు. నేను నా పనులు

చేసుకుంటూ ఫలితాన్ని దైవం మీద నెట్టివేయడం నాకు బాధ్యతారహితంగా కనబడింది. బాధ్యతారహిత ప్రవర్తనవల్ల అవినీతి పెరుగుతుంది. ఈ విధంగా ఆలోచించినా, అనుభవంలో చూచినా దైవవిశ్వాసం నాకు అనవసరం అనిపిస్తుంది. నా కృషి, నా నీతి ప్రవర్తనా అభివృద్ధి పొందాలంటే దైవవిశ్వాసం అడ్డుగా కూడా కనిపించింది.

దైవం అడ్డు అయినా, అనవసరం అయినా, అది నిజం అయితే దానిని ఏదో విధంగా భరించి తీరాలి. కాని వాస్తవిక దృష్టితో పరిశీలిస్తే దైవం అబద్ధం అని స్పష్టపడుతుంది. సాదృశ్యం, హేతువాదన మొదలైన అప్రత్యక్ష ప్రమాణాలతో దైవాన్ని ఊహింపారు. 'బూచి' అంటే చిన్న పిల్లలు నమ్మినట్లే, భయ విస్మయాలకు లోనైన పూర్వీకులకు దైవ విశ్వాసం అవసరం అయింది. వారు దైవం నిజం అనుకున్నారు. దానిని నిర్ధారణ చేసుకోడానికి పూనుకోలేదు. ఎవరేనా నిర్ధారణకు పూనుకుంటే, వారిని నాస్తికులంటూ నిందించారు. చిన్నప్పుడు చెప్పిన మాటల్ని జీవితం అంతా విశ్వసిస్తూ తరతరాల వెంబడి తల్లివద్దనుంచి బిడ్డలకు దైవ విశ్వాసం అందచేశారు. కాని నాగరికత వృద్ధిపొందుతున్న కొద్దీ సంఘబలం పెరిగి భయ విస్మయాలు తగ్గాయి. దైవవిశ్వాసం అవసరంకూడా తగ్గింది. తల్లితండ్రులే గాని చెప్పకపోతే ఈనాడు పిల్లలకు దైవవిశ్వాసం అవసరం వుండదు. ఇట్లు అనవసరం అయిన దైవవిశ్వాసాన్ని బలవంతం పెట్టి పిల్లలకు నేర్పడంచేత పిల్లల అభివృద్ధికి తల్లిదండ్రులు అడ్డుపడుతున్నారు. పిల్లల కృషినీ, నీతినీ కుంటుపరుస్తున్నారు.

దైవవిశ్వాసం వల్ల ఈరోజుల్లో లాభము లేకపోగా నష్టంకూడాను, అందుచేత నాగరికతాభివృద్ధిని గమనించి తల్లితండ్రులు ఎవరూ తమ పిల్లలకు దైవవిశ్వాసాన్ని నేర్పకూడదు. ఒకవేళ నేర్పినా, పిల్లలు దానిని వ్యతిరేకించి బుద్ధిపూర్వకంగా వదలిపెట్టాలి. నాస్తిక దృష్టివలననే జీవితానికి అభివృద్ధి కలుగుతుంది.

# వా. స. వ్య.

నేను నాస్తికుణ్ణిగా జీవిస్తున్నప్పుడు నా దినచర్యల్ని నడుపుకోవడానికీ, నా సమస్యల్ని పరిష్కరించుకోడానికి నాకు కొన్ని కొలతబద్దలు కావాలి. నాస్తిక కొలతబద్దలకూ. ఇతరదృక్పథాల కొలతబద్దలకూ తేడా ఉండబట్టే. నాస్తిక విధానము వేరుగా కావలసి వచ్చింది.

నాస్తికప్రమాణాలను "వాసవ్య" అను పదంలో సూత్రప్రాయంగా చెప్పవచ్చును. నాస్తిక రీతులగు వాస్తవికవాదం, సంఘదృష్టి, వ్యక్తిత్వంయొక్క మొదటి అక్షరములను (వా. స. వ్య.) చేర్చి సూత్రప్రాయంగా 'వాసవ్య' అని చెప్పు కుంటున్నాను.

సత్యమును గ్రహించుటకు వాస్తవికవాదం నాకు సాధనము,
నీతిని నిర్ణయించుటకు సంఘదృష్టి నాకు పరిమాణము.
కృషిని సాగించుటకు వ్యక్తిత్వము నాకు ప్రోత్సాహము.

సత్యజ్ఞానమును సంపాదించుటకు ఎన్ని సిద్ధాంతములనైనను ఏర్పరుచ్చుకోవచ్చును. ఎన్ని విషయములనైనను ఊహించవచ్చు కాని వాస్తవికవాదంబట్టి ప్రత్యక్షప్రమాణమునే తుదినిర్ణయంగా నేను ఎంచుతాను. ఇట్టి రీతినిబట్టి నాకు యితరులతో ఏకీభావము పెరుగుచుండును. భేదభావము తగ్గిపోవుచుండును. మరియు ఇట్టి వాస్తవికత వాదంబట్టే దైవం అబద్ధం అని నేను తెలుసుకున్నాను.

ప్రవర్తనలో నా నీతినియమాలు సంఘదృష్టికి సంబంధించి ఉండునేకాని, స్వర్గనరకాలు, జన్మపరంపరలతోకాదు. ఏప్రవర్తనవలన నేను సంఘబలమును పెంపొందించగలనో అది నాకు నీతి. సంఘబలమునకు ఏకీభావము అవసరముకనుక, నా నీతి ప్రవర్తనలో రహస్యము నిషేధము. బహిరంగ ప్రవర్తనే సంఘబలమును చేకూర్చును.

కర్తృత్వము నాపైన వేసుకున్నప్పుడే నాకృషిలో సామర్థ్యము. బాధ్యత ఉంటాయి. వ్యక్తిత్వము వలన ఇట్టి కర్తృత్వాన్ని నేను పొందు తాను. దైవాన్నిగాని. కర్మసిద్ధాంతాన్నిగాని నమ్మితే కర్తృత్వం నా మీదనుంచి తొలగిపోతుంది. నాకృషి కుంటుపడుతుంది. వ్యక్తిత్వాన్ని నిరూపించడంచేత కర్తృత్వం నామీదనే ఉంటుంది. దైవం, కర్మ అను నమ్మకాలు తొలగిపోతాయి.

ఇట్లు వాస్తవికవాదం, సంఘదృష్టి, వ్యక్తిత్వం (వాసవ్య) అను కొలతబద్దలవలన నా జీవితాన్ని అన్ని రంగాల్లోనూ సౌఖ్యాభివృద్ధివైపు నడుపుకోగలుగుతున్నాను. సత్యదృష్టి, నీతిప్రవర్తన, కార్యదీక్ష పెం పొందుతున్నాయి. వీటిని ఆస్తిక జీవిత విధానంకూడా కోరినప్పటికీ, 'వాసవ్య' ప్రమాణాలను వారు అనుసరించక పోవుటచేత,వారు ఆచరణలో పురోగమించలేకున్నారు.

వాస్తవికవాదం, సంఘదృష్టి. వ్యక్తిత్వంకలసి మానవజీవితం లోని అనుభవాలన్నింటిని ఇముడ్చుకుని ఉన్నాయి, ఏ సమస్యనైనా ఈ మూడింటితోనూ సరిపోల్చి పరిష్కరించవచ్చు. సత్యం. నీతి, కృషి వీటికిమించి ఏసమస్యాపోదు, ఈ మూడింటిలోనే ఆనందం. అందం ఉన్నాయి. ఈ రోజున కళపేరిట స్వార్థం సాగిపోతున్నది, తాజ మహలు అందంగా ఉంది అనుకుంటున్నాం. అలాగ అనేటప్పుడు ఆగ్రాలోనే ఉన్న పందలాది నిర్భాగ్యుల గుడిశల్ని మరచిపోతున్నాం వాటిని ప్రక్కనేపెట్టిచూస్తే, తాజమహలులో అందం బదులు స్వార్థం కనిపిస్తుంది, సిసలయిన అందం సంఘజీవితంలో ఉంది. అందర్నీ ఆనందపరచే నీతి జీవితంలో ఉన్నది. ఉత్సాహాన్ని పురికొల్పే వ్యక్తి త్వంలో అందం ఉంది.

దైవనమ్మకం క్రింద ఇంతకాలంబట్టి అణగారి ఉండి, నాస్తిక

దృష్టి రాగానే బైటపడే అనేక ప్రశ్నలకు "వాసవ్య" సూత్రంలో ఏవిధంగా సమాధానం చెప్పుకోగలమో చూద్దాం,

## సమస్యలు—"వా.స.వ్య." దృక్పథం

నాస్తిక విధానంతో జీవించడానికి వా.స.వ్య. సూత్రం నాకు అనువైన సాధనంగాఉంది. పెద్దపెద్ద ఆశయాల దగ్గరనుంచి నిత్యజీవితంలోని చిన్నచిన్న విషయాలను కూడా ఈ సూత్రంతో పరిష్కరించుకోగలుగుతున్నాను.

ఉదాహరణకు ఒక్కొక్క విషయాన్ని తీసుకుందాం. నాకిప్పుడున్న సమిష్టి భోజనాల దృష్టే తీసుకుందాం, నేనుకూడా చిన్నప్పటినుంచి చాలా కులతత్వాల్లోంచి పెరిగినవాడినే, నాకూ రకరకాలైన కులద్వేషాలు, కొన్ని ఆహారాలపైన అసహ్యం ఉంటూఉండేది. ఏమీ చెప్పలేకపోయినా ఇతర్లతో కలవాలంటే వారుశుభ్రంగా ఉండాలనేవాణ్ణి. ఇవే విషయాలు ఈనాడు అనేకమంది అంటూఉంటే నేను వింటున్నాను. కాని అవన్నీ ఈనాడు శుద్ధతప్పుగా నాకు కనిపిస్తున్నాయి, నేను అందరితోటీ సరిసమానంగా కలవగలుగుతున్నాను, నాకన్న ఒకరు హెచ్చుగాను కనబడరు; మరొకరు తక్కువగానూ కనబడరు. ఈ మార్పు నాలో ఎలాగ వచ్చిందంటారు ? ఈ నాస్తికదృష్టివల్లనే వచ్చింది. "వా. స. వ్య,"లో సంఘదృష్టి అంటే రకరకాల కులాలు, మతాలు, జాతులమధ్యన సామరస్యంకాదు, 'వాసవ్య'లోని సంఘదృష్టియొక్క అర్థం మనుష్యులందరూ ఒకేరకమైన వారని. ఒకేరకంఅంటే ముక్కు మొగంతీరులో పోతబొమ్మల్లాగ ఉండాలనికాదు, మనకున్న ఎక్కువ తక్కువల ప్రమాదం పొట్టిపొడుగులవల్ల రావడంలేదు, మనం కల్పించుకున్న కులమత భేదాలవల్ల, ఆర్థికవ్యవస్థవల్ల వచ్చాయి, ఇదివరకు

ఇవి దైవకల్పితమనో లేక నా శక్తికి మించినవనో అనుకొనేవాణ్ణి ఇవాళ అలా అనుకోను. నావ్యక్తిత్వంవల్ల నాశక్తికి మించినదంటూ అనుకోను. అందుచేత ఈ సంఘదృష్టి ఇవాళ ఎలాగ ఉందంటే - అందరు మనుషులు ఒకచేనని అనుకొంటాను, వారందరూ జీవించడానికి అవకాశాలు సమానంగా ఉండాలనుకొంటాను. ఇది భేదాలమధ్య సామరస్యంకాదు. అసలు భేదాలు కల్పించుకోవడమే తప్పు. ఉన్నదే ఒకరకం. ఇటు వంటి సంఘదృష్టి నాస్తికత్వంవల్ల అలవడింది. అందరూ ఒకటైన ప్పుడు అందరితో నేనెందుకు భోజనం చేయకూడదు ??

## విద్య

విద్య అంటే వ్రాయడం చదవడం అనేదృష్టి సాధారణంగా ఉంది. అందుచేతనే వయోజనవిద్య అంటే వ్రాయడం చదవడం నేర్పుతూ ఉంటాము, వ్రాయడం చదవడంవస్తే ఒకరిభావాలు ఒకరు తెలుసుకోవడం సులభం అవుతుంది. అంతవరకూ అది బాగుంది. కాని చదవడం వ్రాయడం రాగా వచ్చినవాళ్ళు ఎంతోమంది రకరకాల కులతత్వాలలోను, మూఢనమ్మకాలలోను మునిగిఉండడం చూస్తున్నాం. అందుచేత విద్య అంటే చదవడం, వ్రాయడమేకాదు. చదవడం వ్రాయడం నేర్పును అక్షరాస్యత అనాలి. విద్యఅంటే, అది మానవ ప్రవర్తనకు సంబంధించిన సంస్కృతి. విద్యను పొందటానికి అక్షరాస్యత ఒక సాధనమేకాని, అక్షరాస్యతే విద్యకాదు. అందుచేత నాస్తికదృష్టిలో విద్యయొక్క అర్థం ప్రవర్తనకు సంబంధించి ఉంటుంది.

ఇప్పుడు ప్రచారంలో ఆస్తికభావాలున్నాయి. ఒకఉదాహరణ స్పష్టపరుస్తుంది. "ఏమిజన్మము, ఏమిజీవనము ఈమాయ కాయము" అనేపాట సర్వసాధారణంగా వింటూ ఉంటాము. అటువంటిభావం ప్రచారంలో ఉండటంచేత ప్రజల ప్రవర్తనకూడా ఇది "ఇది మాయ

కాయము" అనే నిరాశాదృష్టిలోనే ఉంటున్నది. "ఏమిజన్మము ఏమి జీవనము" అని జీవితముతో విసుగుచెంది ఉంటున్నారు. వారికి అక్షరాస్యత ఎంతఉన్నా, వారివిద్యమాత్రం నిరాశ, విసుగుతోనిండి ఉంది. అందుచేత విద్యావ్యాప్తి ఉంటే అక్షరాస్యతతో తృప్తిపొందరాదు. అక్షరాస్యతను నేర్పేపాఠాలలో ఏఏభావాలు చెబుతున్నాయో కుడా పరిశీలించాలి.

ఈనాడు పాఠ్యగ్రంధాలలో దేవుడు, ప్రార్థన గురించి వ్రాస్తూ ఉంటారు. అటువంటి పాఠాలే అంతకంతకు "ఏమిజన్మము ఏమి జీవనము" అనేతత్వబోధనలకు దారితీస్తున్నాయి. మనమాటలలోకూడ "అదృష్టం, దైవేచ్ఛ, దైవికం" వంటివాటికి తావుయిచ్చి నిరాశ, బలహీనతను ప్రజలలో కలిగించాయి. అందుచేత విద్యావ్యాప్తిలోనూ, రచనలలోనూ, భాషేకాకుండా భావాలగురించికూడా శ్రద్ధతీసుకోవాలి. అక్షరాస్యతే కాకుండా, విద్యావ్యాప్తికికూడా గమనించాలి. వ్యక్తిత్వం, వాస్తవికదృష్టికి సంబంధించిన భావాలను ప్రకటించాలి.

## ప్రచారం

మన భావాలూ, మన ప్రవర్తనా మన వ్యక్తిత్వానికి సంబంధించి ఉండవలసిందే. ఎవరి మటుకు వారు తమ ఆదర్శాల్ని, అవకాశాల్ని, సంఘ అవసరాల్ని పోల్చి చూచుకొని తమ ప్రవర్తనను నిర్ణయించుకోవాలి. ఇది ఉత్తమం. కాని నిత్య జీవితంలో మాటిమాటికి వ్యక్తిత్వం ప్రదర్శించడం కష్టతరమైన పని. కొంత అలవాటు మీద, సాంప్రదాయం మీద ఆధారపడిపోతూ ఉంటాం. మన సుఖ జీవితానికి ఆ పాత అలవాట్లు తోడ్పడక పోయినప్పుడు మనం పునరాలోచన చేసి ప్రవర్తనలో మార్పు తెచ్చుకుంటాం. అందుచేత ఒకవైపున అలవాట్లు సరియైన వి అయి వుండ

డం, రెండోవైపున అవసరమైనప్పుడు వ్యక్తిత్వాన్ని ఉపయోగించడం కావాలి. కాని ఈ నాటి జీవితం ఈ రెండింటికీ అనుకూలంగా లేదు.

మొదటిది : ఆస్తిక నమ్మకం వలన సర్వం దైవాధీనం అనుకొని వ్యక్తిత్వాన్ని వినియోగించడం తగ్గిపోయింది. ఈనాటి జీవితంలో ఎన్ని కష్టాలొస్తున్నా లొంగి ఊరుకుంటున్నారు గాని అన్యాయాన్ని ఎదుర్కొనడం లేదు. నామటుకు నేను నాస్తికుణ్ణి అయిన తర్వాతనే వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకో గలుగుతున్నాను. అంతకు ముందు ఏకష్టం వచ్చినా నోరు మూసుకొని పడి ఉండేవాడిని. ఇంకా ఎంతోమంది ప్రజానీకం ఈ విధంగా ఉండటం చేతనే ఈ అస్పృశ్యత, దారిద్ర్యం సాగుతున్నాయి, పేదలు కూడా మనుష్యులే కదా; ఎందుకు వారు ఈ అన్యాయాల మీద తిరుగబడరు?

మొన్న ఒక హరిజనవాడలోని ఒక సమావేశానికి వెళ్ళాను. బియ్యం దొరకకా, బ్లాకు మార్కెట్టు ధరలవల్లా వారు చాలా బాధపడుతున్నారు. "మీరు ఎందుకు ఇంత పేదరికంలో ఉన్నారు?" అని అడిగాను. "వ్యవసాయానికి మాకు పొలాలు లేవు. పూర్తిగా కూలిమీద ఆధారపడి ఉన్నాం. ఒకప్పుడు కూలి ఉంటుంది, ఒకప్పుడు ఉండదు" అన్నారు. "కొంత మందికి అధికంగా అన్ని పొలాలు ఉండగా మీకెందుకు లేవు?" అని మళ్ళా అడిగాను. "వాళ్ళకు భగవంతుడు ఇచ్చాడు. మాకు ఇవ్వలేదు." అని నిస్పృహతో జవాబు చెప్పారు. "దానిని మనం సరిదిద్దుకోలేమా?" అని నేను అడుగగా వారు పెదిమలు విరచి నిరాశను చూపించారు. దీన్ని బట్టి వారి వ్యక్తిత్వం ఎంతవరకు కుంటుపడిపోయిందో తెలుస్తున్నది. వ్యక్తిత్వం ఎంతో ఈవిధంగా వెనకబడి పోవడంచేతనే బెంగాలు క్షామంలో అన్ని లక్షలమంది తిండి లేకుండా మలమల మాడి మరణించారు; అన్యాయాన్ని ఎదిరించే శక్తిని వారు కోల్పోయారు. నాస్తిక ప్రచారం వలన వ్యక్తిత్వం బయటపడి అన్యాయాలు తగ్గుతాయి.

మన అలవాట్లు కూడా విస్తారంగా ప్రచారం వలన ఏర్పడుతాయి. చిన్నప్పటి నుండి మనకు ఏభాషనైతే అలవాటు చేస్తారో అది మాతృ భాష అయినట్లు, ఏ భావాలను చెబుతారో అవే అలవాటు పడిపోతాయి మన కులతత్వాలూ, మతాభిమానాలూ ఈ విధంగా మనకు వచ్చిన అలవాట్లే కదా. దైవనమ్మికకూడా ఒక అలవాటే. మాటలలోనూ, చేతల లోనూ, పాఠాలలోనూ "దైవం, దైవం" అంటూ ఎంతో చిన్నప్పటి నుండి మన తల్లిదండ్రులు చెబుతారు. అందుచేతనే మనకు దైవం మీద నమ్మిక అలవాటు అవుతుంది. దైవం గురించి చెప్పకపోతే, మనకు ఈనాడు దైవం అనే భావం అవసరం లేదు. నాకూ పిల్లలు ఉన్నారు. వారికి దైవం అనే మాటే చెప్పము వారు ఎదిగిన తర్వాత వారికి ఈ కులతత్వాలూ, మతాభిమానాలూ, కర్మ సిద్ధాంతాలూ, దైవారాధనలూ, ప్రార్థనలూ రానే లేదు. వాటి అవసరంకూడా వారికి కనబడడమూ లేదు. అందుచేత మనం చేసే ప్రచారం గురించి మనం జాగ్రత్త పడాలి. మన బడి పుస్తకాల్లోంచి, పాఠాల్లోనుంచి దైవం అనే మాటను తీసివేయాలి. మన మాటల్లో కూడా జాగ్రత్త పడాలి.

## ఆహార కొరత

నాస్తిక దృష్టితో చూస్తే, మనం అభివృద్ధి పొందవలసిన మార్గాలు కనపడుతూ ఉంటాయి.

మనందరికీ ముఖ్యావసరం ఆహారం. అందరికీ తిండి వుండి తీరాలి, తిండి వున్న తరువాతే తక్కిన జీవిత అవసరాల గురించి ఆలోచిస్తాం. గౌరవాల కోసం, ఘనతల కోసం చేసే త్యాగాలు తిండికి లోపం తీరిన తరువాతే వస్తాయి.

అయితే ఈ ఆహార సమస్య కష్టమయింది కాదు. మన బుద్ధి కుశలత వలన, మన సంఘటిత శక్తి వలన మనకు కావలసిన ఆహారాన్ని

వ్యవసాయ సాధనం వలన సులభంగా ఉత్పత్తి చేసుకోగలం ఆహారం ఉత్పత్తి అయ్యేక ఇంకా అధిక జీవిత సౌకర్యాన్ని సమకూర్చుకోడానికి ఎంతో తీరిక, శక్తి మిగిలి ఉంటాయి. ఇంత అవకాశం ఉండీ కూడా ఈ నాడు ఆహార కొరతతో బాధపడుతున్నామంటే మన శక్తిసామర్థ్యాలు, తెలివితేటలు పెడత్రోవన పట్టాయని స్పష్టమౌతోంది. మన కాలాన్ని ఎంతో పరలోక చింతనతో పాడుచేసున్నాం. అట్లు కాకుండా నాస్తికదృష్టి వస్తే మన శక్తిసామర్థ్యాలు సద్వినియోగం అవుతాయి.

ఇప్పుడు ఆహారకొరత ఉంది కదా, నాస్తికులం దీనిని ఎట్లా తీరుస్తాం?

ఆహార కొరతకు వెంటనే కనుపించే కారణం అసమాన పంపిణీ. పంపిణీని సమానం చెయ్యడానికని చేసే ప్రయత్నాల్లో రేషనింగు ఒకటి. ఈనాడు రేషనింగు ఉన్నా ప్రభుత్వ ఆర్థిక విధానం వలన అది సక్రమంగా అమలు జరగటంలేదు. ప్రజలు కూడా "మనకు ఇంతే ప్రాప్తి, అని పడి ఊరుకుంటున్నారు. నాస్తికదృష్టి ప్రబలుతున్న కొద్దీ ఇటువంటి నిస్పృహ, ఉదాసీనత తొలగిపోతాయి. సక్రమ రేషనింగు విధానాన్ని అమలు జరపమని ప్రతినిధి అయిన ప్రభుత్వాన్ని నిలబెట్టి అడుగుతాం. ఇట్టి ప్రజాచైతన్యం వలన ప్రభుత్వ విధానం చక్కబడి ఉన్నంత మట్టుకూ పంపిణీ సమంగా వుంటుంది.

పంపిణీ సమం అయినప్పటికీ, ఈనాడు ఒక దేశంలో ఉన్న నాభా అంతా కడుపునిండా తిండి తినడానికి ఆదేశములో ఉత్పత్తి అయ్యే ఆహారం చాలదు. అందుచేత కొందరు కడుపునిండా తింటే, మరికొందరు ఆకలితో మాడుతూ వున్నారు. అందరకూ తిండి వుండాలంటే పంపిణీతో పాటు అధిక వుత్పత్తి కూడా కావాలి. జనాభా అంతకంతకు పెరుగుతూ వుండటము చేత ఆహారవుత్పత్తి కూడా అంతకంతకూ పెరుగుతూ జవుండాలి. ఇది ఎలాగ సాధ్యం, దీనికి రెండు విధానాలు ముఖ్యం.

ఒకటి : మన ఆహార దినుసులలో వరి, గోధుమ, జొన్న, సజ్జ, చోళ్ళ వంటివి ముఖ్యం. అనగా కూరగాయలూ, పళ్ళూ దుంపలూ కంటే ధాన్యాదులే మన ఆహారానికి ముఖ్యం. ధాన్యజాతులు పండినంత విస్తారంగానూ సులభంగానూ ఏపంటా పండదు. అందుచేత అందరికీ కడుపు నిండా తిండి దొరికే వరకూ మనం వేసే పైరులలోనూ మనంచేసే వ్యవసాయ కృషిలోనూ ధాన్యాల పంటల మీదనే శ్రద్ధ వహించాలి. ఇతర పంటల్ని, వృక్షజాతుల్ని కొంచెం వెనక్కి వుంచాలి.

రెండు : ఏ వ్యవసాయానికైనా నీరుముఖ్యం. వర్షాధారం ఒడుదుడుకులు కలుగచేస్తుంది. అందుచేత మనం చెరువులు కాలువలు వృద్ధిచేసుకోవాలి. ఇందుకుగాను నదులలోనీరు సముద్రంలోనికి ప్రవహించకుండా ఎంతవరకు అడ్డగలమో, మన వ్యవసాయానికి అంత తోడ్పాటు సముద్రంలోని ఉప్పునీరు ఎండవలన ఆవిరై, నేలమీద మంచినీరుగా వర్షిస్తుంది. నదులనీరును తిరిగి సముద్రంలోనికి పోనిస్తే మనకుండే మంచి అవకాశం జారవిడిచిన తెలివితక్కువ వాళ్ళంఅవుతాము. అందుచేత ఇంజనీర్ల కృషి ఆనకట్టలు నిర్మించడంలో అధికంగా ఈనాడు వినియోగించాలి. అందచందాలతో నగిషీల భవనాలు కట్టుతూ ఇంజనీరులు కూర్చునివుంటే అందంపేర పూవులూ, ఆకులూ పెంచే వ్యవసాయకునివలే సంఘద్రోహం చేసిన వారవుతారు. అందరికీ కడుపునిండా తిండి కలిగేవరకూ తలదాచుకునే ఇల్లు చాలు. నదులనీటిని సముద్రంలోనికి పోనివ్వకూడదు.

ఇదే నాస్తికుల ప్రయత్నం. ఆహారకొరత తీర్పు. అందరికీ తిండిపెట్టే మార్గం.

## అ ధి క శ క్తి

నాస్తికదృష్టి రాగానే "అసాధ్యం" అనేమాట పోతుంది. అన్నింటిని నేను నెరవేర్చుకోగలను అనే ధృఢవిశ్వాసం కలుగుతుంది.

నాకోరికలను పెంచుకుంటాను. వాటిని నెరవేర్చుకుంటాను. పెరుగు తున్న నాకోరికలను నెరవేర్చుకోడానికి నాశక్తి కూడా పెరుగుతూవుండాలి. ఇది రెండు విధాల పెరుగుతుంది.

1. యంత్రబలం
2. సంఘబలం

యంత్రాలవల్ల మనిషి తనబలాన్ని ఎన్నోరెట్లు అధికం చేసుకుం టున్నాడు. నడవడంలో రైళ్ళు, విమానాలవల్ల వేగం ఎన్నోరెట్లు అభివృద్ధి పొందింది. చేతితో ఎత్తలేని బరువు యంత్రాలతో ఇట్టే ఎత్తి పారేసున్నాం. యంత్రసాధనవల్ల మనకు అడ్డంగావుండే కొండలను పిండికొట్టేసున్నాం. ఎన్నోవిధాల యంత్రాలవల్ల మనిషిబలం వృద్ధి పొందుతుంది. అందుచేత నాస్తికులు తప్పకుండా యంత్రాలను ప్రోత్స హిస్తారు.

యంత్రబలం కంటె అధికమయ్యేది సంఘబలం. ప్రజలు కలిసి ఆలోచించడంచేత నాగరికతను నిర్మించుకుంటున్నారు. పట్టణాలను కడు తున్నారు. ప్రభుత్వాలను నడిపిస్తున్నారు. ఇంత శక్తివంతమైన సంఘాన్ని నాస్తికులు బలపరుస్తారు.

సభ్యులలో సమానత వుంటేనే సంఘం సక్రమంగా నడుస్తుంది. లేకపోతే ద్వేషాలతోనూ, మోసాలతోనూ సంఘబలం క్షీణిస్తుంది. అందుచేత సంఘశక్తిని కోరే నాస్తికుడు సమానతలోనే సంఘబలం వుందని గుర్తిస్తాడు. అందుచేత కోరికలు పెంచుకోవడంవల్ల సౌఖ్యం వృద్ధిపొందడం నిజమైనప్పటికీ సంఘంలో కోరికలు పెరిగేటప్పుడు అవి వ్యక్తిగతంగా కాకుండా సంఘపరంగా వుంటాయి. సంఘసమానత కొరకని తనయొక్క కోరికలను ప్రతివ్యక్తి అదుపు ఆజ్ఞలలో వుంచుకుం టాడు. కోరికలు నెరవేర్చుకొనేశక్తి అభివృద్ధి చేసుకొనుటకే తన కోర్కెలు సంఘపరం చేయుట అవసరం.

ఇట్లు యంత్రశక్తి వలన, సంఘశక్తి వలన వ్యక్తి శక్తి పెరుగుతుంది,

## అ ం ద ం

నాస్తికదృష్టితో చూస్తే అందం అర్థం మారిపోతుంది.

అందం అంటే వున్న ఆకారాన్ని మరింత సొంపుగా తయారు చేయటమేకదా, అందుకనే ఈనాడు తళతళ మెరిసే నగలతోనూ రంగు రంగుల దుస్తులతోనూ అలంకరించుకుంటారు, వ్యక్తిగతంగా చూస్తే నగలు, దుస్తులు అందంగా ఉండవచ్చు. కాని సంఘదృష్టిలో నగలను చూచి ఆనందించగలమా ? తోటిమానవుల నోటివద్దకూటిని అపహరించి ధనాన్ని పోగుచేసి, దాన్ని నగలుగామార్చిన స్వార్థం, కాఠిన్యం ఆనగలలో కనుపించడంలేదా ? ఉపకరణాలతో అలంకరించుకొనగోరితే అది స్వార్థానికి దారితీస్తుంది, ఎందుకంటే ఉపకరణాలు సేకరించడానికి పోటీపడి స్వార్థులౌతారు, అది సంఘదృష్టికి లోపం,

అయితే అందం చేసుకోవడం ఎలాగ ? నిలకడైన అందం ముఖ్యంగా మన ప్రవర్తనలో వుంటుంది ఎటువంటి ప్రవర్తనలో అయితే సంఘదృష్టి, వ్యక్తిత్వం ప్రదర్శింపబడుతూ ఉంటుందో అది ఇతరులను ఆకర్షిస్తూ వ్యక్తి రూపానికి అందం కల్పిస్తుంది. దీనికితోడు వ్యక్తి తనకున్న కనుముక్కుతీరులను, కాళ్ళు చేతులను తీవిగా వుంచుకొనవచ్చును, ప్రవర్తనకుగాని, తీవికిగాని, ఉపకరణములు అవసరము లేదు, అందుచేత ఇవి స్వార్థమునకు దారితీయవు,

ఇట్లు నాస్తిక దృష్టిలో అందముయొక్క అర్థము వ్యక్తిగతముగా వుండదు. అది సంఘదృష్టితో జతపర్చబడి వుంటుంది. అటువంటప్పుడు నగలు నిషేధాలవుతాయి వ్యక్తియొక్క దృష్టి తన ప్రవర్తనవైపు, తన తీవివైపు మరలుతుంది. ఆభరణములు, దుస్తులు ధరించినపుడు అందము;

తీసివేసినపుడు అందవికారము కాకుండా అనుక్షణము ప్రవర్తనవలన, శీవివలన అందమును పెంపొందించు కొనవచ్చును. ఆభరణముల వలన కలుగు అందము స్వార్థమునకు దారితీస్తే ప్రవర్తన, శీవివలన వచ్చు అందము సంఘదృష్టిని, వ్యక్తిత్వమును పెంపొందించును,

## ఉత్సాహం పట్టుదల

నాకు ఇదివరలో ఏపని చేయడానికైనా అమిత ఉత్సాహంగా వుండేది ఇప్పుడు నాస్తికదృష్టి పెరుగుతున్న కొద్దీ నాకు పట్టుదల పెరుగుతోంది. ఉత్సాహానికీ పట్టుదలకీ ఆచరణలో తేడా వుంది.

ఉత్సాహం వల్ల ఏపనిలో అయినా ఉద్రేకంతో దూకుతాం. అది ఒక సరదాగా వుంటుంది. ఆపని అవడంతోనో, అవకపోవడంతోనో ఆ ఉత్సాహం పూర్తయిపోతుంది. ఇక ఆపనిని అభివృద్ధి మార్గాన తీసుకు పోము.ఉదాహరణకు కులాలూ మతాలూ మానవ కల్పితమని సాధారణంగా అందరికీ తెలుసు. ఎందుకు కలసి భోజనం చేయకూడదు? అనే ప్రశ్న ఎవరైనావేస్తే "సరే"అని భోజనంకూడా చేయవచ్చు కొంతమందిఉత్సాహం వాదనతోటే ఆగిపోతుంది. కలసి భోజనం చేయడం వరకూ కూడా రాదు. కాని, వీటి వేటివల్ల కూడా కుల మత తేడాల సమస్య పరిష్కారం కాదు. వాటిని పరిష్కరించాలనే దృష్టి వున్నప్పుడు పట్టుదలతో ఇంకా ముందరకు వెళ్ళవలసి వస్తున్నది. ఈప్రాంతంలో కుల, మత, తేడాలు, శాకాహారం, మాంసాహారం, మాంసాలలో మళ్ళా రకరకాల మాంసాలతోనూ ముడి పెట్టబడి వుంది. అందుచేత ఆ సమస్యలో ఇంకా నేను ముందరకు వెళ్ళాలంటే ఈ ఆహార తేడాల నియమాలను కూడా దాటుకు పోవాలి. ఇదే పట్టుదల.

ఆస్తికనమ్మకాలవల్ల రకరకాలైన రాగద్వేషాలూ, దురభిమానాలూ ఏర్పడి వుండేవి. అవి కూడదని ఉత్సాహంతో ఎంతవాదించినా ఆచరణలో

పాతహద్దులను దాటిపోవడానికి సంకోచం వుండేది. నాస్తికదృష్టి ఆ సంకోచాలను విడగొట్టింది, ఒక పనికి పూనుకొన్నప్పుడు దానికి కావలసిన ఇతర మార్పులన్నీకూడా తీసుకురావడానికి స్వేచ్ఛ, సంసిద్ధత ఏర్పడ్డాయి అనగా ఒక పనిని నెరవేర్చడానికి పట్టుదల వచ్చింది. ఉత్త ఉత్సాహంలో తాత్కాలిక సమస్యలతో ఆచరణ ఆగిపోయేది. మామూలు సంకోచాలు యధాప్రకారమే వుండిపోయేవి. నాస్తిక దృష్టివలన పనిలో పట్టుదల వచ్చినది. ఒక పనికి పూనుకుంటే దానిని పూర్తిగా కొనసాగించేవరకూ పాత అలవాట్లలో ఎన్ని మార్పులయినా చెయ్యడానికి, అభివృద్ధిమార్గాన సాగిపోవడానికి హాయిగా వుంది.

ఉత్సాహం వల్ల ఒకదూకు ముందుకుదూకి, మళ్ళా వెనక్కి పోవడానికని సంకోచించరు. పట్టుదల వుంటే అడుగడుగు వేసుకుంటూ ఎప్పుడూముందుకుసాగిపోతారు ఉత్సాహంలో వినోదదృష్టి.సరదా హెచ్చుగా వుంటాయి. ఫలితంమీద దృష్టి అంతగా వుండదు. ఫలితం రాక పోతే కాలం, కర్మం కలసిరాలేదు అనుకుంటాడు. నాస్తికదృష్టిలో కాలం, కర్మం, దైవాధీనం వంటి ఆస్తిక అల్పసంతృప్తులుండవు పనియొక్క ఫలితానికి తనదే బాధ్యత కనక - ఫలితం మీద శ్రద్ధవహించి దృష్టి వుంటుంది. అంచేత ఫలితాన్ని సాధిద్దామని పట్టుదల పెరుగుతుంది. కార్య సాధనకు ఉత్సాహముకంటే పట్టుదలే అవసరము. ఇది నాస్తికదృష్టి వలన వస్తుంది.

## వి నో దా లు

నాస్తికదృష్టి నాలో పెరుగుతున్నకొద్దీ నాకు సరదా, వినోదం తగ్గిపోతున్నట్లు కొందరు ఆక్షేపిస్తారు. సన్యాసత్వమువంటి కఠోరదీక్షలు నాలో పెరుగుతున్నాయని నన్ను నిందిస్తారు, కాని వారు నన్ను నాస్తిక దృష్టితో చూడటం లేదు.నాస్తికదృష్టితో నన్ను చూచినట్లయితే నిజంగా

నాలో, వినోదాలూ, సరదాలు ఇదివరలో కంటే పెరిగాయి నాస్తిక దృష్టిలో వినోదం అంటే ఏమిటో అర్థం చేసుకుంటే దీని యదార్థం స్పష్టమౌతుంది. నాస్తిక దృష్టికి వా. స. వ్య. (వాస్తవికత. సంఘదృష్టి, వ్యక్తిత్వం) గీటురాళ్ళు. కనుక వీటితోనే వినోదాలను కూడా పరిశీలించాలి. పూర్వకాల మతదృష్టిలో సంక్రాంతి బక్రీదు క్రిష్టమస్, ఓనము వంటి పండుగలు వున్నాయి. వాటిని జరుపుకోవడం సరదా, వినోదం అనుకునే వారు కాని వా. స. వ్య. తో పరిశీలిస్తే అవి తప్పు. మొట్టమొదట వాటిలో వాస్తవిక దృష్టిలేదు. ఆయా పండుగలలో ప్రతిదానికీ ఏదో ఒక కథ వుంటుంది. అందులో రాక్షసులు గురించో, దేవతల గురించో చెప్పబడి వుంటుంది. ఆ పండుగలు చేసేవారు ఆ పురాణాలు నిజం అనుకుంటారు. ఆ రోజున దైవ ప్రార్థనలూ, పూజలూ చేస్తారు. ఆ పండుగలు చెయడం చేత మానవునిలో వాస్తవికత, వ్యక్తిత్వం సంఘదృష్టి కుంటుపడతాయి. అందుచేత నేను ఆ పండుగలు చేయను.

నాస్తికుల పండుగలు యదార్థ ప్రకృతి సౌందర్యాన్ని ఆనందించేవి, మానవ కృషి ఫలితాన్ని అనుభవించేవి, ఆదర్శాలను గురించి వుత్సాహం ఉప్పొంగించేవిగా వుండవచ్చు. ఉదాహరణకు పౌర్ణమిరాత్రి సమిష్టి భోజనాలు, మనలో వ్యక్తుల జన్మదినోత్సవాలూ, పైరుపంటల కోతల రోజులు. నూతన ఉద్యమాల ప్రారంభోత్సవాలూ – ఇటువంటివి నాస్తికుల పండుగలు.

మరిన్ని ప్రతి వినోదంలోనూ సంఘదృష్టి వుండాలి. కాని ఆస్తికుల వినోదాలలో ఇది తక్కువ. తాము సమృద్ధిగా భోజనం చేసి మిగిలిన ఎంగిలాకులను ఇతరులకు పారవేసే రీతిలోనే వారు పండుగ దినాల్లో ప్రదర్శించే దానధర్మ కార్యాలుకూడా వుంటాయి. ఆర్థిక సంపద కలిగిన వారిలో ఇట్టి స్వార్థవినోదం హెచ్చుగా వుండుటచేత ఆ పండుగలు వినో

దాలుగాగోచరిస్తాయి. కాని వాటిలో స్వార్థము హెచ్చుగా వుందని మరచి పోరాదు. నాస్తికదృష్టితో సంఘదృష్టి పెంపొందుతున్నకొద్దీ వినోదము వ్యక్తిగతముగా కాక సంఘపరం అవుతుంది. ప్రక్క గుడిసెల్లో ఆకలి చేత బాధపడుతూ వుండగా ఒక మేడలో పండుగ చేసుకోవడం సంఘ దృష్టిగల వినోదమేనా ? ఇతరులకు కూడా ఆనందం చేకూర్చే వినోదమే నాస్తికుని వినోదం. నాస్తికుని వినోదాలలో వ్యక్తిగత అడంబరం తగ్గు తుంది. సంఘపరంగా సరదా పెరుగుతుంది. ఉదాహరణకు సమిష్టి భోజనాలలో ఒక్కొక్కరి సమృద్ధి తగ్గుతుంది. కాని సంఘం మొత్తం మీద సంతృప్తి పెరుగుతుంది. నాస్తికుని వినోదంలో ఎత్తు కనిపించదు. విరివి, వ్యాప్తి మాత్రం విశేషంగా వుంటుంది.

## "నేను నాస్తికుణ్ణి"

"నేను నాస్తికుణ్ణి" అని నేను అనుకోవడం కొంతమందికి ఆశ్చ ర్యంగా ఉంది, నీతి కావాలి అనేటటువంటివాడివి నువ్వు నాస్తికుడివి ఎలా అవుతావు అని వారు నన్ను ప్రశ్నిస్తారు. అనగా వారి దృష్టిలో నాస్తి కత్వానికీ నీతికీ దూరమనుకుంటారు. ఇటువంటి దృష్టితోనే నిఘంటువు లలో కూడా నాస్తికుడంటే దుర్మార్గుడని ఒక అర్థం చెప్పివుంది. అందు కనే కాబోలు నేను నాస్తికుణ్ణి అని చెప్పుకునేవాళ్ళు చరిత్రలో అంతగా కనబడ్డం లేదు. పైపెచ్చు ఎవరినైనా నిందించాలంటే "వాడు నాస్తికుడు" అని నిందించేవారు. ఈనాడుకూడా "వాడికి దేవుడు లేదు దయ్యం లేదు" అనే మాట దూషణశబ్దంగా వాడుతారు. క్రీస్తు, మహమ్మద్, రామమో హన్, దయానంద్, గాంధీ మొదలైన ప్రవక్తలంతా కూడా తమతమ తరాలవారిచేత "వీడికి దేవుడు లేడు" అని అనిపించుకుని హింసింప బడ్డారు, నాస్తికత్వం అంటే దుర్మార్గం అనే పొరపాటు భావం ప్రజలలో

వ్యాపించి వుండటంచేతనే ఇటువంటి అవకతవక మన ఆలోచనల్లో వస్తుంది.

నిజానికి నాస్తికత్వం అంటే నీతి. నీతి పెరగాలంటే నాస్తికత్వాన్ని అనుసరించాలి. కాని నీతి పెరగడం కొంత కొంత మందికి ఇష్టం వుండదు. ఎందుకంటే నీతి పెరగగానే ఎక్కువ తక్కువలు పోతాయి. కులగౌరవాలలో ఆధిక్యతలు అనుభవించేవారికి దెబ్బ. అసమాన సాంఘిక వ్యవస్థలో ఆధిక్యత అనుభవించేవారందరికీ నీతి అంటే గిట్టదు. కాని నీతి వద్దు అని బహిరంగంగా చెప్పలేరు. ఎందుకంటే సంఘ నిర్మాణానికి నీతి మూలం కనుక. నీతి వర్ధనగానే వారి స్వార్థం బట్టబయలు అయిపోతుంది. అందుచేత నీతి పెరగకుండా కుయుక్తులు పలుకుతారు. అందులో "నాస్తికత్వం అంటే దుర్మార్గత" అను ప్రచారం ఒకటి.

నీతి పెరగడానికి నాస్తికత్వము సాధనము. నీతిగురించి ఎంత మాట్లాడినా నాస్తికదృష్టి రానంతకాలం అవి శుష్కప్రియాలక్రింద ఉంటాయి. అందుచేత ఈ స్వార్థులు ఏమిచేస్తారంటే ఒకవైపు నీతి గురించి మాట్లాడుతూ రెండోవైపు నాస్తికత్వాన్ని నిందిస్తూ వుంటారు. అందుకనే తరతరాలనుంచీ గ్రంథాలూ, ప్రబోధాలూ, వుపన్యాసాలూ ఎన్ని వున్నప్పటికీ అస్పృశ్యత, దారిద్ర్యం. ద్వేషం ఇంకా తగ్గలేదు. నాస్తికత్వాన్ని నిందిస్తూ వుండటమే ఈ అవకతవకకు కారణం. ఇటువంటి స్థితిలో నీతిని పెంపొందించాలంటే ఒకటే మార్గం. "నేను నాస్తికుణ్ణి" అని గట్టిగా బైటపడాలి. నాస్తికునిలో నీతి అధికంగా వుంటుంది. కనుక ప్రజలు తబ్బిబ్బు పడతారు. "నేను నాస్తికుణ్ణి" అనుకునేవారిలో ఒకవైపున ప్రత్యక్షంగా అధికనీతి కనపడుతుంది. ఇంకొకవైపున "నాస్తికత్వం అంటే దుర్మార్గత" అని తరతరాలుగా జీర్ణించియున్న భావం వెనక్కు లాగుతూ వుంటుంది. ఈ రెండింటి మధ్యన వున్న వైరుధ్యమే "నేను నాస్తికుణ్ణి" అనుకోగానే వచ్చే ఆశ్చర్యానికి కారణం. పాతభావా

లకీ, ప్రత్యక్షానికీ తేడా వచ్చినప్పుడు ఎన్నటికైనా ప్రత్యక్షమే విలు స్తుంది. పాతభావాన్నే మార్చుకోవలసి వస్తుంది.

అందుచేత నీతిని కోరువారికి ఒక సూటి మార్గం వుంది. "నేను నాస్తికుణ్ణి" అని గట్టిగా చెప్పుకోవాలి. దానివల్ల ప్రారంభదశలో కొంత వ్యతిరేకత వస్తుంది. కాని నాస్తికుని నీతి ప్రత్యక్షముగా ప్రకటితమవు తున్నకొద్దీ పాత భావాలు సడలిపోతాయి. నాస్తికత్వంయెడల విముఖత పోయి, సుముఖత ఏర్పడుతుంది. నాస్తికత్వం అంటే దుర్మార్గత అనే బదులు సన్మార్గత అనే భావం వస్తుంది. నిఘంటువులలోనూ, వాఙ్మయం లోనూ ఉన్న అర్థాలుకూడా మార్చవలసి వస్తుంది. నీతి పెరుగుటకు ఈ విధముగా బాట ఏర్పడుటచేత రకరకాలయిన అసమానతలు తొలగిపోయి ఆర్థిక సమానత్వము, మర్యాదల్లో సమానత్వము మానవ సంఘంలో ఏర్పడుతుంది. "నేను నాస్తికుణ్ణి" అని కార్యకర్తలు ప్రకటించుకోవడం చాల ముఖ్యం.

## చదువుకున్నవారి స్వాతిశయము

బాగా చదువుకున్నవారికితప్ప నాస్తికత్వం అర్థం కాదనిన్నీ, మూర్ఖప్రజలకు నాస్తికత్వం ప్రబోధిస్తే ప్రమాదం వస్తుందనీ కొందరు ముఖ్యంగా నాలుగుపుస్తకాలు చదువుకుని, విద్యావంతులమని అనుకునే వారు అంటారు. దీన్నిబట్టి నాస్తికప్రచారానికి వీరికి అభ్యంతరంలేదు. వీరి అభ్యంతరమల్లా ఎక్కడ అంటే ప్రజాస్తికం మూఢత్వంలో ఉన్నారు కాబట్టి నాస్తికప్రచారం ఇప్పుడు వద్దంటారు. ప్రజలలో మూఢత్వంలేకపోతే నాస్తికప్రచారానికి అభ్యంతరంలేదు. ఈ వాదనలో ఒక లోపం వుంది. తామేదో ఘనుల మనుకొని ఇతరులంతా మూఢులనుకోవడం వీరి పొర పాటు, స్వాతిశయం. ఇతరులు మూఢులని వీరెందుకు అనుకోవాలి?

ఇతరులకన్న వీరి ఘనత ఏమిటి ? అసలు ఇతరులకన్న తాము ఎక్కువ అనుకోవడంలోనే పెద్ద పొరపాటు ఉంది. నాస్తికదృష్టి వచ్చినప్పుడే ఈ స్వాతిశయాలు తొలగిపోతాయి. మరియు చదువున్నంత మాత్రాన అది విజ్ఞానం అనుకోవడం పొరపాటు. వ్యక్తిగత ఆస్తి ఉన్న ఈ రోజుల్లో చదువుకూడా ఒక ఆస్తిగా పరిణమిస్తున్నది. ఇతరులకంటే అధిక ఆస్తి ఉండడం ఎలా తప్పో అలాగే తన నిత్యజీవితానికి మించిన చదువుకూడా ఒక పొరపాటే. తన అధిక ఆస్తిని పోషించుకోవడానికి ధనికులు పెట్టే వాదనలలాంటిదే విద్యావంతుడు పెట్టే ఈ వాదం కూడాను.

ఇప్పుడు ఆస్తిక నమ్మకాలలో ఉండబట్టే రకరకాలయిన మూఢ నమ్మకాలలో ఉంటున్నారు. ఈ నమ్మకాలు తొలగాలంటే దానికి సాధనం విద్యకాదు. నాస్తికప్రచారంవల్లనే ఈ మూఢనమ్మకాలు తొలుగుతాయి. ఎంతో చదువుకున్నవారి జీవితాలు చూస్తే వారి జీవితాచరణలో ఎన్నో మూఢనమ్మకాలుంటాయి. అందుచేత ఆస్తికీ–నీతికీ సంబంధం లేనట్లే, ఈనాటి చదువుకీ – నీతికీ సంబంధంలేదు. నీతిపెరగాలంటే నాస్తిక ప్రచారమే కావాలి, ఆస్తికులవాళ్ళల్లోను. విద్యావంతులలోనూ స్వాతిశయం పోవాలంటే నాస్తిక ప్రచారం కావాలి.

## ఏదో ఒక శక్తి

నాస్తిక భావం పెంపొందుతున్నకొద్దీ ఆస్తిక నమ్మకంలోని బూటకం బయట పడిపోతూ ఉంటుంది. దేవుడు, పరలోకం, జన్మ పరం పర ఇటువంటివన్నీ మానవ కల్పిత భావాలనీ, పరిశీలిస్తే అవి అబద్ధా లని స్పష్టపడుతుంది. కాని ఆస్తిక జీవితానికి అలవాటు పడ్డవారు తమ తమ దురభిమానాలచేత దైవ భావాన్ని వదలిపెట్టలేరు. "దేవుడు లేక పోయినా ఏదో ఒకశక్తి ఉందా లేదా ? అదే మనచేత మాట్లాడిస్తోంది.

దానిని ప్రకృతి అనండి. ఏమయినా అనండి. దానికి దైవం అని పేరు పెట్టనక్కరలేదు. అటువంటి శక్తి ఏదో ఒకటి ఉందికదా" అంటారు ఇది ఆస్తికవాదం యొక్క ఆఖరి దశ. ఆస్తికత్వం అంటే బానిస భావ మని మనం అనుకుంటూనే ఉన్నాం, అటువంటి బానిస భావంవల్లనే ఇటు వంటి శక్తిగురించికూడా ఆలోచిస్తారు. ఏదో ఒకశక్తి ఉంది అనుకొని, ఆ శక్తిమీద తమ జీవితాన్ని ఆధారపరుస్తారు. ఇదే బానిసభావం.

అటువంటి శక్తేగాని ఉన్నట్లయితే దానికీ, మన జీవితానికీ సంబంధం ఏమిటి? సంబంధంలేని శక్తిగురించి అసలు మనం ఆలోచిస్తామా ? జీవితానికి సంబంధంలేని శక్తిని ఎలాగో నిలబెట్టడానికి ఇంత ఆవేదన ఎందుకు పడాలి ? మన జీవితానికీ, ఆ శక్తికీ సంబంధం ఉంటే, ఆ సంబంధం ఎట్టిది ? మన జీవితాన్ని అది నడుపుతూవుంటే. మనకు ప్రత్యక్ష అనుభవం అయిన వ్యక్తిత్వానికి అది వ్యతిరేకం కాదా ? అటువంటప్పుడు ఆ శక్తి కలదను సిద్ధాంతం తప్పుకాదా ? మరియు ఆ శక్తివలననే సూర్య చంద్రాదులు, విశాల ప్రకృతి సృష్టింపబడినదని సంతృప్తి చెందుతూ ఊరుకుంటే మన వాస్తవిక దృష్టికి అది అడ్డురాదా? విజ్ఞానం కుంటుపడదా ? ఈ విధంగా మనం పరిశీలించుకుంటే ఏదో మూలశక్తి ఉందన్న అభిప్రాయం మనల్ని తప్పుదారిని పెడుతుంది. దైవభావాన్ని ఒక ప్రక్క సమర్థించుకోలేక, రెండవవైపున దానిని వదిలిపెట్టలేక చిక్కుకునే దురభిమానంవలన ఇటువంటి శక్తిగురించి మాట్లాడుతారేగాని. యదార్థానికి అటువంటిశక్తి ఏమీ లేదు. నాస్తిక దృష్టిని ధైర్యంగా అవలంబిస్తేనే మన వ్యక్తిత్వం, మన వాస్తవిత, మన సంఘ దృష్టి పెరుగుతాయి.

## "ఇది ఎన్నటికైనా జరుగుతుందా ?"

మన ప్రతిమాట, మన ప్రతిచేత మన భావాల్ని, దృక్పథాన్ని తెలియజేస్తాయి, ఉదాహరణకు ఈ మాట తీసుకుందాం.

"అందరికి కూడూ గుడ్డా ఉండాలని చెప్పితే ఇది ఎన్నటికైనా జరుగుతుందా ?" అని సాధారణంగా అంటారు. అందరికీ కూడూ-గుడ్డా ఉండడం, అందరికీ సమానత్వం చేకూరే సాంఘిక విధానం ఏర్పడడం వారికీ ఇష్టమే. కాని అటువంటిది ఎన్నటికైనా జరుగుతుందా అనే వారి అనుమానం.

ఈ మాట ఏ దృక్పథాన్ని వెల్లడిస్తున్నది ?

"ఇది ఎన్నటికైనా జరుగుతుందా ? అనే ప్రశ్నలో తన ప్రయత్నం ఏమీ లేదని తెలిపోతున్నది. ఒక మార్పు రావాలను కోరికే గాని దానిని నెరవేర్చుకునే కృషి, దీక్ష తాను చేయుటలేదని స్పష్టం. ఇదే ఆస్తికదృష్టి, తాను కోరడమేకాని, దానిని సాధించే బాధ్యత తనపైన వేసుకోవడంలేదు. అందరం సుఖముగా ఉండాలను కోరికలూ, "సర్వేజనాః సుఖినోభవన్తు" అను ఆశీర్వచనాలు చాలాకాలంబట్టి ఉన్నప్పటికీ, అవి ఆచరణలోనికి రాకపోవుటకు కారణం ఇటువంటి మాటలద్వారా వెల్లడి అయ్యే ఆస్తికదృష్టే.

నాస్తికదృష్టి ఉన్నవారిమాట ఈ విధముగా ఉండదు. ఒక ఆశయం ఉన్నప్పుడు "ఇది ఎన్నటికైనా జరుగుతుందా ?" అని అనదు. అయితే నాస్తికుని మాట ఏ రీతిగా ఉంటుంది ? "ఇది నేను జరిగించుతాను.", "ఇది మనం జరిగించుకుందాం" అంటాడు నాస్తికుడు.

"ఇది జరుగుతుందా ?" అనడానికీ, "ఇది జరిగించుకుందాం?" అనడానికి ఎంతో తేడా ఉంది, "ఇది జరుగుతుందా ?" అనడంలో కోరికే గాని ప్రయత్నం లేదు, "ఇది జరిగించుకుందాం." అనడంలో కోరికతో పాటు ప్రయత్నంకూడా ఉంది. మొదటిది ఆస్తికదృష్టిని వెల్లడించే మాట. రెండవది నాస్తికదృష్టివలన వచ్చేమాట.

ఆస్తికదృష్టివలన ఉత్త కోరికలేకాని, పనులు జరుగవు. నాస్తిక దృష్టివలననే పనులు జరుగుతాయి. ఇంతకాలంబట్టి ఆస్తికదృష్టి ప్రబలంగా ఉండడంచేతనే, "సత్యం వద, ధర్మం చర" వంటి నీతివాక్యాలు ఎన్నో చెబుతున్నారేకాని, పనులు నెరవేరుట మాత్రం స్వల్పం. అవి నెరవేరాలంటే నాస్తికదృష్టి రావాలి.

"ఇది ఎన్నటికైనా జరుగుతుందా ?" అని ఏ పనిగురించి అనుకున్నా అది జరుగుట దుర్లభము, చిన్నదైనా, పెద్దదైనా ప్రతి పనిని మనమే మన ప్రయత్నంవలన సాధించుకోవాలి. ఇదే నాస్తికదృష్టి. "దీనిని జరిపించుకుంటాను" అని నాస్తికుడు అంటాడుకాని, "ఇది ఎన్నటికైనా జరుగుతుందా ?" అను నిస్సహాయతలో నాస్తికుడు ఉండడు.

## భాషలో రావలసిన మార్పు

నేను నాస్తికుణ్ణి అవగానే నా ప్రవర్తన ఎలాగ మారుతుందో, నా భాషకూడా అలాగే మారాలి, ఇదివరలో ఆస్తిక భావాలు మనల్ని ఆవరించి ఉన్నాయి, అందుచేత వాటికి సంబంధించిన పరాధీనత మన భావాల్లోనూ, చేతల్లోనూ ఉండడమే కాకుండా, మన మాటల్లో సామెతల్లో కూడా ఉండేది, "తాను ఒకటి తలిస్తే, దైవం ఒకటి తలుస్తుంది" అనే సామెత సాధారణంగా వాడుతారు, అది ఆస్తిక భావం. అందులో నిరాశ, పరాధీనత ఉంది. అలాగే "వారి అదృష్టం", "కాలం – కర్మం కలిసి రావాలి", "దిక్కులేనివారికి దేవుడే దిక్కు", "మనచేత నేమవుతుంది" మొదలైనవెన్నో ఊతపదాలుగా భాషలో వాడుతుంటారు. ఇవి ఉత్త పదాలే కాదు, లోగడ ఆస్తిక సాంప్రదాయాన్ని తెలియజేసిన మాటలు. విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ పరాధీనత తగ్గుతూ వచ్చింది. అందుచేత ఈ

మాటలు కొంతభాగం ఊతపదాలయినాయి. ఉదాహరణకు "దైవసాక్షిగా దేవుడంటే నాకు నమ్మకం లేదు.", "దేవుడున్నాడో లేడో దేవుడికే ఎరుక" మొదలైన మాటల్లో దైవభావం చాలా లాంఛనప్రాయంగా వాడబడ్డదని తెలుస్తుంది. ఆ విధంగా లాంఛనంగా వాడినా, వాటివల్ల రెండు ప్రమాదాలున్నాయి. మొదటిది, అట్లు మాట్లాడేవారి ఆలోచనలు స్పష్టంగా తెలుస్తున్నాయి. వారి మాటకూ, వారి అభిప్రాయానికీ సంబంధం లేదు. రెండవది. ఆమాటలు ఆస్తికభావాన్ని అలాగే ప్రచారంలోఉంచుతున్నాయి. ఇతరుల లోనుంచి ఆస్తిక నమ్మకలు పోకుండా వుంచుతున్నాయి.

అందుచేత నేను నాస్తికుణ్ణి అనుకున్నంతమాత్రాన చాలదు. నా ప్రవర్తనలో నాస్తికతను, సంఘ దృష్టిని, వ్యక్తిత్వాన్ని బుజావుపరచుకున్నట్లే, నా మాటల్లో పరాధీనత పోయి ఆత్మవిశ్వాసం తెలుస్తూఉండాలి. "నేనే సాధిస్తాను", "నేనే ప్రభుత్వం" వంటి మాటలు ప్రచారంలోకి తీసుకురావాలి. ఆస్తికభావాలకు అలవాటుపడ్డవారు వీటిని "అహంభావం" అంటారు. వారి పరాధీనతతో పోల్చిచూస్తే ఆత్మవిశ్వాసం అహంభావంగా కనబడుతుంది, కాని, ఆత్మవిశ్వాసం పెరగవలసిందే. భాషను మార్చవలసిందే. కవులు, రచయితలు భాషను విరివిగా వాడుతారు. వారికి ఎన్ని అభ్యుదయ భావాలున్నా భాషలో జాగ్రత్తగా లేకపోతే, యతిప్రాసల కొరకని పాతమాటలనే వాడుతుంటారు వారివలనకూడా ఆస్తికభావాలు అనుకోనిదే ప్రచారంలో ఉంటాయి. అందుచేత వారు మొదటి రోజులలో కొంత ప్రయత్నం చేసి అపశబ్దాలలాగ ఆస్తికమాటల్ని ఎంచి తీసివేయాలి. భాష నాస్తిక బాటను పడేవరకు అతి జాగ్రత్త అవసరం. నాస్తికభావాలు ఉన్నప్పటికీ అశ్రద్ధవల్ల ఆస్తికత్వం ప్రచారంలో ఉంటుంది. ప్రజాజీవితంలో మార్పురాదు, మార్పు విరివిగా రావాలంటే మన చేతలతోపాటు మన మాటలుకూడా చాలా జాగ్రత్తగా ఉండాలి. క్రొత్త క్రొత్త సామెతలను కల్పించుకోవాలి. పరాధీనత, కులదృష్టి, మతద్వేషం సూచించే పాత

భాష, పాత సామెతలు పాత పదప్రయోగాలు మానివేసి వాస్తవికత, సంఘదృష్టి, వ్యక్తిత్వం ప్రకటించు భాషను ప్రచారంలోనికి తీసుకు రావాలి.

## నాస్తికుని ఆస్తి

పదంయొక్క అర్థంబట్టిచూస్తే 'నాస్తి' అనగా 'లేదు' అని. అయితే ఏమిటిలేదని అర్థం ? అలాగే 'అస్తి' అంటే ఉందని అర్థం. ఏమిటి ఉందని ?

ఈ ప్రపంచాని కంతటికీ మూలాధారంగా ఏదోఉంది అనుకోవడమే ఆస్తికత్వం 'ఆమూలాధారం శక్తి' అనుకోవచ్చు.' పదార్థం' అనుకోవచ్చు లేక 'ఒకవిధానం' అనుకోవచ్చు.ఆశక్తికిగాని, పదార్థానికిగాని గుణాలు ఆరోపించవచ్చు, లేక దానిని వర్ణనాతీతం అనవచ్చు. అనిర్వచనీయం అనవచ్చు. ఏమి అన్నాసరే ప్రపంచానికి మూలం ఒకటి ఉందనుకోవడం ఆస్తికత్వం. అటువంటి దృష్టిలో ఆ "ఆస్తి" అనగా ప్రపంచానికి ఒక మూలం ఉందనుకోవడం.

"నాస్తి" అనగా ప్రపంచానికి అటువంటిమూలం లేదని, అలాగ మూలంలేదని నాస్తికత్వం ఎందుకంటుంది ? ఏమి ఉందంటుంది ? ఈ ప్రశ్నలగురించి ఆలోచించాలి.

ప్రపంచానికి మూలాధారం ఏమయినా ఉంటే మానవజీవితంకూడా ఆ మూలములో ఒకభాగమై తీరిందని ఒప్పుకోవాలి. ఏ భాగానికైనా వేరేస్వేచ్ఛ ఉండదు. పరిపూర్ణమైన విషయంయొక్క నియమాలనే భాగంకూడా అనుసరించవలసి వస్తుందికదా, అందుచేత ప్రపంచానికి మూలంఒకటి ఉందని ఒప్పుకుంటే. మనిషికి వ్యక్తిత్వంలేదని అంగీకరించి తీరాలి, అందుకనే ఆస్తిక సాంప్రదాయంలో 'సర్వం దైవాధీనం' 'బుద్ధిఃకర్మానుసారిణీ' మొదలైన మాటలున్నాయి, మనిషికివేరే

వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం లేదనే వీటి అర్థం. మనిషికి వ్యక్తిత్వం ఎప్పుడైతే లేదో అప్పుడు తనప్రవర్తనపై తనకు స్వాతంత్ర్యంగాని, బాధ్యతగాని ఉండదు. అటువంటప్పుడు మానవజీవితంలో నీతినియమాలే ఉండవు. కాని ఇదంతా యదార్థానికి విరుద్ధము. నిత్యజీవితంలో మనకు వ్యక్తిత్వం ప్రత్యక్షానుభవం నీతికొరకు సదా మనం ప్రయత్ని స్తూఉంటాము, ఇటువంటి ప్రత్యక్షానుభవాలతో పోల్చిచూస్తే ఏదో ఒక మూలం ఉందనిగాని, దానిలో ఒకభాగం అనిగాని అనుకోవడం తప్పుఅని తెలుస్తుంది,

ఇట్లు "నాస్తి" అనగా 'ప్రపంచానికి మూలం అనేదిలేదు' అని అర్థం, అయితే ఉన్నదేమిటి? మన వ్యక్తిత్వం ఉంది, మన నీతి ప్రవర్తన ఉంది.

ఆస్తిక సిద్ధాంతములో "ఉన్నది" అనునది "ప్రపంచానికి మూలాధారం". దానినిబట్టి వ్యక్తిత్వం. నీతి.లేకుండా పోతాయి. నాస్తిక సిద్ధాంతంలో "లేదు" అనునది ఆ "ప్రపంచమూలమే". అయితే నాస్తికత్వంలో ఉండేవేవనగా వ్యక్తిత్వం నీతి.

అసలు మానవునకు ఉన్నదే వ్యక్తిత్వం. ఈ వ్యక్తిత్వంతో తన జీవితాన్ని నడుపుకుంటున్నాడు. తన పరిసరాలను అర్థంచేసుకుంటున్నాడు. ఇట్లు అర్థం చేసుకోవడంలో ప్రపంచాని కంతటికీ ఏదోమూలం ఉందను కున్నాడు. అదే అతని ఆస్తికనమ్మకం, అదేఅతని పొరబాటు. దాని వలన అతని ఆలోచన, ప్రవర్తన తికమకల్లో పడిపోయింది, తనకు వ్యక్తిత్వం లేదంటూ, తనవ్యక్తిత్వంతోనే నిరూపించు కున్నట్లయింది. ఇటువంటి పరస్పర విరుద్ధాలు ఆస్తిక ఆలోచనలలో యిమిడిఉన్నాయి. ఈ తికమకలలోనుంచి బయటకుతీసి, వ్యక్తిత్వాన్ని: నీతిని నిలబెట్టడానికే నాస్తికత్వం కావాలి. ప్ర ప ం చా ని కి మూలాధారంలేదు. మనిషికి వ్యక్తిత్వం, నీతి ఉన్నాయి అని చెప్పడమే నాస్తికత్వం.

# దీక్ష

పనులు చేయడానికి ఉత్సాహం ఉండాలంటారు. కాని ఉత్సాహం బాధ్యతారహితమైన ఉద్రేకం. దానికి నిలకడ లేదు. సంఘదృష్టికి అది వ్యతిరేకం. ఉత్సాహం ఉన్నప్పుడు పనులు నెరవేర్చి. ఉత్సాహం వన్నగిల్లగానే చతికిలబడి కూర్చుంటే వానిని ఇతరులు నమ్మలేరు. ఎందుకంటే ఒప్పగించిన కార్యం నెరవేరుతుందో లేదో నిశ్చయం లేదు. ఉత్సాహం ఉంటే పని జరుగుతుంది. లేకపోతే లేదు. సంఘ సంబంధాలలో ఇది ప్రమాదావస్థ.

ఆస్తిక నమ్మకాలున్నప్పుడు ఉత్సాహము అనే సాకు పనిచేస్తుంది. కార్యం నెరవేరుతే సరేసరి, లేకపోతే అది "దురదృష్టం" అనో, "కాలం-కర్మం కూడి రాలేదనో", "తానొకటితలిస్తే దైవం వేరొకటితలచిందనో", నమ్మి ఊరుకుంటారు. నిరుత్సాహంతో క్రుంగిపోకుండా దైవాన్ని ప్రార్థిస్తారు. ఇటువంటి సాకులకు అవకాశం ఉంది కనుకనే ఆస్తికుల పనులు ఉత్సాహ నిరుత్సాహాలనుబట్టి పోతూ ఉంటాయి. ఆస్తిక సాంప్రదాయంలో పనులు నెరవేరుతాయన్న నమ్మకం లేదు.

నాస్తికుడు సంఘ దృష్టి కలవాడు. తాను పూనుకొన్న పనిని నెరవేర్చి తీరుతాడు. లేకపోతే తన లోపం వలన సంఘ సంబంధాలలోని ఇతర సభ్యులు కష్టనష్టాలకు గురి అవుతారు. అందుచేత నాస్తికుని పనిలో దీక్ష ఉంటుంది. నాస్తికుని ఉత్సాహం కార్యదీక్షకు లోబడి ఉంటుంది. నాస్తికుడు ఎన్నడూఉత్సాహంతో పొంగిపోడు;నిరుత్సాహంతో కృంగిపోడు. దీక్షతో సమముగా కార్యాలను నెరవేరుస్తూ ఉంటాడు.

పట్టుదలతో పనులు చేస్తూ ఉండడం చేత నడకలో వచ్చే వడుదుడుకులను నాస్తికుడు అడుగడుగునా గమనిస్తూ ఉంటాడు. వ్యతిరేకత వస్తే దైవం మీద భారం వేసి కూర్చోడు కనక వ్యతిరేకతలను శాంతంతో పరి

శీలించి సర్దుకుంటూ ఉంటాడు. సంఘ దృష్టితో కార్యసాధనకై కృషి చేయడమే నాస్తికుని దీక్ష యొక్క లక్షణం. నాస్తికుని కార్య దీక్షకు ఉత్సాహ నిరుత్సాహాలు లోబడి ఉంటాయి.

## అయాచితాలు - ఆశాభంగాలు

మన జీవితంలో విస్తారం ఆశ్చర్యం కలిగించేవి అయాచితాలు, ఆశాభంగాలు. మనం అనుకున్న ప్రకారం లాభంవచ్చినా, నష్టం వచ్చినా మనకి మామూలుగానే ఉంటుంది కాని అనుకోనిలాభం వచ్చినా, అనుకోని నష్టం వచ్చినా మనకు మించిన ఏదో శక్తి వలన అట్లు జరిగిందని విశ్వసించడం అలవాటుగా ఉంది. ఇది ఒక ఆస్తిక అలవాటు. ఆస్తికత్వం అంటే బానిస భావం కనుక అయాచితాలను, ఆశాభంగాలను తనకు మించిన శక్తి యొక్క ప్రభావానికి ముడిపెట్టి తాను తృప్తి చెంది ఆస్తికుడు ముణచుకొని కూర్చుంటాడు. వాటికి అదృష్టం, దురదృష్టం అని పేరు పెడతాడు. అయాచితంగా లాభం వస్తే దైవాన్ని పూజించి తన ఉత్సాహాన్ని వెలిబుచ్చుకుంటాడు; ఆశాభంగం వల్ల నష్టం వస్తే నిరుత్సాహపడి పాపపరిహారార్థం శాంతులూ, ప్రాయశ్చిత్తాలు చేసుకుంటాడు.

కాని, నాస్తికదృష్టిలో అయాచితాలకు, ఆశాభంగాలకు అర్థం వేరు. ఏవ్యక్తి అయినా తను ఒక్కడే ప్రపంచంలో లేడు. ఎండా, వానా, గట్టు, పుట్ట, చెట్టు, చేమా వంటి పరిసితులు తనచుట్టూ ఎన్నో ఉన్నాయి. తనవలెనే రాగద్వేషాలతో మెలిగే తోటి మానవులు తన చుట్టూ ఎందరో ఉన్నారు. వీటన్నింటియొక్క ప్రభావం తన ప్రయత్నాలమీద ఉంటుంది. మొత్తం మీద ఈ పరిస్థితులు తన ప్రయత్నాలకు ఒకొక్కప్పుడు అనుకూలంగా ఉంటాయి. ఇంకొకప్పుడు ప్రతికూలంగా ఉంటాయి. కాని వీటన్నింటి మధ్య తన ప్రయత్నమే బలమైన శక్తి. తన ప్రయత్నం వలన పరిస్థితుల ప్రభావాన్ని మార్చుకోవచ్చు. కాని, తాను అశ్రద్ధగా ఉండి తన ప్రయత్న బలాన్ని తగ్గించు కున్నప్పుడు పరిస్థితుల ప్రభావము వలన కొన్ని కొన్ని పనులు జరుగుతుంటాయి. అవి అనుకోకుండా జరిగే పనులు. తనకవి అనుకూలంగా ఉంటే అయా

చితాలు అంటారు; ప్రతికూలంగా ఉంటే ఆశాభంగా లంటారు. వీటిలో తనకు మించిన శక్తి ఏమీ లేదు. తాను తన ప్రయత్నంతో వాటిని మార్చుకోవచ్చు.

అయాచితాలకు నాస్తికుడు పొంగిపోడు; ఆశాభంగాలకు కృంగి పోడు. తన ప్రయత్నాన్ని ఇంకా బలపరచుకొని పరిస్థితులను తన ఆశయానికి అధికంగా అనుకూలంగా మార్చుతుంటాడు.

అయాచితాలను, ఆశాభంగాలను పూర్వజన్మ కర్మఫలంతోనో, దైవ సంకల్పంతోనో ముడిపెట్టడంచేత ఆస్తికుడు తన అనుభవాలవల్ల విజ్ఞానాన్ని పెంచుకోవడంలేదు. చేసిన పొరపాట్లనే పదేపదే చేస్తూ ఉంటాడు. ఎప్పటి కప్పుడు అదృష్టమనో, దురదృష్టమనో తృప్తి చెందుతూ ఉంటాడు. కాని నాస్తికుడు అనుక్షణం తన అనుభవం వల్ల విజ్ఞానాన్నీ, కృషినీ అభివృద్ధి చేసుకుంటూ ఉంటాడు. ఆశయసిద్ధిని పొందుతూంటాడు.

## అనుభవం. ఆశయం

"చరిత్ర ఒక చక్రం" అను లోకోక్తి ఉంది. చరిత్రలో జరిగిన విషయాలే మళ్ళా తిరిగి జరుగుతాయని దీని అర్థం. (History repeats itself). ఒక దేశానుభవం బట్టి ఇంకొక దేశం భావి నిర్ణయించవచ్చు అనుకుంటారు. విప్లవాలు, విధానాల యొక్క ఫలితాలను చరిత్రానుభవా లను బట్టి ఊహిస్తారు మార్క్సు తన సిద్ధాంతాన్ని గత చరిత్రాను గత సత్యాల మీద ఆధారపరచి భావిలో ఒక బాట వేశాడు. నిజమే. చరిత్ర అనుభవం మీద ఆధారపరచి రాబోయే సందర్భాలను గురించి కొంత ఊహించి ముందు జాగ్రత్త పడుతున్నాం. కాని నాస్తిక దృష్టితో చూస్తే చరిత్ర యొక్క ప్రాముఖ్యత ఎంతవరకు?

ఇనుపముక్కను ఎన్నిసార్లయినా వేడిచేయ వచ్చును, ఎన్నిసార్ల యినా చల్లార్చ వచ్చును. ప్రతీ సారి పాత రీతిగానే మారుతూ ఉంటుంది. కాని ఒక మనిషికి ఒక మాటచెప్పి ఒక పనిని ఒక పర్యాయం

చేయించవచ్చు. ఇంకొకసారి అదేమాట చెప్పి ఆయన చేత అదే పని చేయించలేము. అలాగే ఒక పేచీ వేసి ఒక వస్తాదును కుస్తీలో చిత్తు చేయవచ్చు. అదే పేచీతో ఆయన్ని ఇంకోసారి ఓడించలేము. ఎందుచేత? మనిషికి జ్ఞాపకశక్తి ఉంది, ఊహ ఉంది. పాత అనుభవాన్ని మరల అదే విధంగా జరుగనివ్వడు. దానిలో మాటిమాటికి మార్పులు తెస్తూ ఉంటాడు. అదే అభివృద్ధి. అనుభవాలు చక్రం వలే గిర్రున తిరిగితే అది అభివృద్ధి కాదు. పాత అనుభవాల మీద కొత్త పోకడలు వస్తేనే అభివృద్ధి అవుతుంది. ఈ కొత్తపోకడలే మానవుని వ్యక్తిత్వం ; దాని ప్రత్యేకత అంయుచేత మానవ చరిత్ర చక్రం వంటిదికాదు. గతం వలే భావి ఉండనక్కరలేదు.

ఇంతవరకు మానవులలో ఆస్తిక భావాలు ఉండుటచేత వారి వ్యక్తిత్వం బయటపడుట లేదు. వారి జీవితం దైవాధీనమో, కర్మవశమో అనుకొని ప్రయత్నాన్ని విజృంభింప చేయకుండా ముణుచుకుని కూర్చుంటున్నారు ఆర్థిక భౌతిక సుడిగుండాలలో కొట్టుకుపోతున్నారు. వారి వ్యక్తిత్వం తక్కువ అవడం చేత వారి చరిత్రకూడా చక్రంవలెనే చాలా భాగం ఇంతవరకు ఉంది. అందుకే మార్క్సు అలా అనుకున్నారు.

కాని, నాస్తికదృష్టి పెంపొందుతున్న కొద్దీ వ్యక్తిత్వం విజృంభిస్తుంది. పరిస్థితులకు తాను లొంగే బదులు మానవుడు పరిస్థితుల్ని తానే లొంగగచుకుంటాడు. అప్పుడు చరిత్ర విషయాలు సమాచారాలే అవుతాయి గాని, మానవుల భావిని నిర్ణయించే సత్యాలు కావు.

నాస్తికుని జీవితంలో అనుభవంకంటె ఆశయమునకే ప్రాముఖ్యత. గతంకంటె భావిపై పేదృష్టి. చరిత్ర పరిశోధనకంటె ఆశయసిద్ధికే కృషి. ఒకదేశంలోనో, ఒక సమాజంలోనో ఒకవిషయం జరిగితే ఇంకొక దేశంలోగాని, సమాజంలోగాని అట్లే జరుగునని చెప్పుట, జరుగనిచ్చుట ఆస్తిక సాంప్రదాయము. ఆదిమానవ వ్యక్తిత్వానికి లోపం. వ్యక్తిత్వాన్ని (వా. న. వ్య) బలపరచే నాస్తికదృష్టి చరిత్రను మరల

అలాగే జరుగనివ్వదు. ఆశయంవేపు నడిపిస్తూ ఉంటుంది. నాస్తికుని జీవితంలో చరిత్రకీ, అనుభవానికీ అంతగా ప్రాధాన్యతలేదు. ఆశయమూ కృషి ప్రాముఖ్యత వహిస్తాయి.

## ప్రా ర ం భ ం - ప ట్టు ద ల

ప్రతిమనిషి తనకోరిక ప్రకారం పనులను ప్రారంభిస్తాడు. ఆ కోరికలు నెరవేరితే తనకు సంతోషం అందుచేత వాటిని నెరవేర్చుకోడానికికూడా ప్రయత్నిస్తాడు. ప్రయత్నబలములోనే ఆస్తిక దృష్టికీ, నాస్తికదృష్టికీ తేడా వస్తుంది.

పనులు ఎప్పుడూ పరిస్థితులమధ్య జరుగుతూఉంటాయి. అవి వాతావరణ పరిస్థితులుకావచ్చు: సామాజిక పరిస్థితు : కావచ్చు. వీటిలో కొన్ని తన పనికి అనుకూలంగాఉంటాయి. కొన్నివ్యతిరేకంగా ఉంటాయి. మరికొన్ని తటస్థంగా ఉంటాయి. వీటన్నింటిమధ్య పనిని నెరవేర్చుకునే బాధ్యత వ్యక్తిది. వ్యతిరేకతలను చూచి విసుగుచెంది కార్యంలేదు. ప్రతికూలురను చూచి నిందించి కార్యంలేదు. సంగతి, సందర్భాలను తెలుసుకుంటూ తనప్రయత్న బలముతో పనిని సాధించడమే ముఖ్యం. ఒకవేళ పని ఫలించడం చేత వచ్చే లాభంకంటె వ్యతిరేకతలను ఎదుర్కొనుటచేత వచ్చే నష్టమే హెచ్చయితే ఆ పనిని వదిలివేయవచ్చు. అంతేగాని, పనినివదలక, నెరవేర్చుటకు ప్రయత్నాన్ని సాగించక, ఇతరులను నిందిస్తూ కూర్చుంటే దుఃఖమేగాని సౌఖ్యం రాదు. ఈసందర్భంలోనే దైవవిశ్వాసం వలన ప్రయత్నబలము సన్నగిలడానికి వీలున్నది. వ్యతిరేకతలు వచ్చినప్పుడు కాలం-కర్మం కలిసిరావడం లేదనో, తానొకటి తలిస్తే దైవమొకటి తలచినదనో అల్పసంతృప్తితో ఎక్కడికక్కడ ప్రయత్నాన్ని విరమించుకోడానికి పెరటిత్రోవ ఉంటుంది. దైవం మీద భారంవేసి మూతాత్రోపుతో ముందుకుసాగేవారు పరిస్థితులను అర్థంచేసుకోలేరు. వారు నెగ్గినా, నెగకపోయినా, వారి విజ్ఞానం అభివృద్ధి పొందదు. ఒకేపొరబాటును పదేపదే చేస్తుంటారు.

నాస్తికవృష్టిగాగానే విజ్ఞానం పట్టుదల పెరుగుతాయి. ప్రతీ వ్యతిరేకతను, అనుకూలతను నాస్తికుడు అర్థం చేసుకుంటాడు. అనవ సరమని ఏపనినుండైనా బుద్ధిపూర్వకంగా విరమించుకుంటేనే తప్ప. ప్రారంభించిన పనిని పట్టుదలతో సాధించిన తీరుతాడు. నిందకు, నిస్పృహకు నాస్తికత్వంలో తావులేదు. మధ్యదారిలో వదిలిపెట్టి పోవ డానికి కాలం, కర్మం, దైవంవంటి కుంటిసాకులు లేవు.

కార్యభారం తనపై ఉండడంచేత నాస్తికునిలో బాధ్యత, జాగ్రత్త, ఏకాగ్రత పెంపొందుతాయి. ప్రారంభించిన పనిని పట్టుదలతో నెర వేర్చి తీరాలి.

## విగ్రహము

విగ్రహము అంటే కోరికలను, తనప్రవర్తనను అదుపాజ్ఞలలో ఉంచుకోవడం. ఇది మంచిదే. కాని, దానికికూడా ఒక గీటురాయి ఉంది. తనకోరికలను, తనప్రవర్తనను ఎవరేనా ఎందుకు అదుపాజ్ఞలలో ఉంచు కోవాలి ? తనసౌఖ్యం పెరగడమే ఇందుకు గీటురాయి. సామాజికంగా మనిషి జీవిస్తున్నప్పుడు తన సౌఖ్యము పెరగడమంటే సమాజమంతటి సౌఖ్యం పెరగడ మన్నమాట.

ఒకరు సౌఖ్యంగా ఉన్నారనడానికి చిహ్నం అసౌఖ్యం లేకపోవ డమే. సౌఖ్యం చాలావాటివల్ల కలుగుతుంది. ఇది సౌఖ్యము అని నిర్ణ యించలేము. కాని అసౌఖ్యాన్ని మాత్రము పోల్చవచ్చు. ఇతరులను నిందించడంగాని, తనని తాను నిందించుకుంటూ దుఃఖిస్తూ దిగులుపడి కూర్చోవడంగాని అసౌఖ్యానికి చిహ్నాలు. ఏ రకమైన అసౌఖ్యమైనా ఆత్మనిందక్రిందో, పరనిందక్రిందో దిగిపోతుంది. దీనినే సాధారణంగా ఇంకోవిధంగాకూడా గుర్తించవచ్చు. ఈగలు ఉన్నచోట మురికిఉందని గ్రహించినట్లే ఏడుపుఉన్నచోట అసౌ ం ఉన్నదని గ్రహించవచ్చు. ఇటువంటి అసౌఖ్యం లేకపోవడమే ...ౌఖ్యం. అసౌఖ్యాలు తగ్గించు

కోవడానికిగాను, అటుగా సౌఖ్యాన్ని పెంపొందించుకోడానికిగాను, ఏ రక మైన ప్రవర్తన కావలయునో దానిని వృద్ధిచేసుకొనుట కొరకే నిగ్రహము కావలయును. అంతేగాని ఒకవైపు నిగ్రహం ఉందంటూ మణుచుకుని కూర్చుని రెండోవైపున ఏరకమైన నిందల్లో పాల్గొన్నా అది తప్పక బాదస్తమవుతుంది, కాని నిగ్రహంకాదు,

ఇట్లు మన నిగ్రహాలకి సామాజిక సౌఖ్యాభివృద్ధి అనే గీటురాయి ఉంది. నింద, దుఃఖములేకుండా నెరవేర్చగలుగు నిగ్రహమే నిగ్రహము.

## నిరీశ్వరవాదం, నాస్తికత్వం

నిరీశ్వరవాదానికీ, నాస్తికత్వానికీ భేదన్ని స్పష్టంగా గుర్తించాలి. నిరీశ్వరవాదం అంటే జగత్తుకు ఒకమూలంగాని, ఒక దేవుడుగాని లేదనడంవరకే, అది ఒక వ్యతిరేక భావమును సూచిస్తుంది. అంత మాత్రమున అది ఒక కార్యక్రమమునకు దారి తీయదు, మూఢవిశ్వాసా లను ఖండించడంవరకే దానిపని.

నాస్తికత్వం ఒక నిర్మాణాత్మకమైన విధానం, మానవునకు స్వేచ్ఛకలదని నాస్తికత్వం చెబుతుంది, స్వేచ్ఛావికాసమునకు దైవ నమ్మిక అడ్డుపడుట నిజమే. ఎందుకనగా "సర్వం దైవాధీనం" అని ఒకప్రక్కన చెబుతూఉంటే, రెండవవైపున ప్రయత్నం కుంటుపడుతూ ఉంటుంది. అట్లాకాకపోతే ఒకమాటకు ఇంకొకదానికి పొందికలేక అవి నీతి ప్రబలి పోతుంది, అందుచేత నాస్తికాభివృద్ధిలో నిరీశ్వరవాదం ఇమిడిఉంది.

నాస్తికత్వంవలన మనిషి ప్రయత్నంతో ముందుకు సాగిపోతూ ఉంటాడు. ముందుకు సాగిపోయేటప్పుడు కాళ్ళకు అడ్డుపడే ఆటంకాలను తొలగించుకొనుట ఆవసరం, ఆటంకాలను తొలగించుకోవడమే నిరీశ్వర వాదం, అయితే ముందుకు సాగిపోవడానికి ఆటంకాలను తొలగించు

క్రోవడం అవసరం అవుతుంది, కాని ఆటంకాలు తొలగినంత మాత్రాన ముందుకు సాగిపోవడానికి ప్రయత్నం చేయవచ్చు: చేయకపోవచ్చు. అందుచేత నాస్తికత్వానికి నిరీశ్వరవాదం అవసరమేకాని, నిరీశ్వరవాదం వలన నాస్తికత్వం ప్రబలక పోవచ్చు.

నిరీశ్వర వాదంలో మూఢనమ్మకముల వంటి వ్యతిరేకతలను ఖండిస్తాం. నాస్తికత్వంలో నిర్మాణయుతంగా ముందుకు నడుస్తాం. నిరీశ్వరవాదం ఒక విధ్వంసక చర్య. నాస్తికత్వం ఒక అభివృద్ధి కార్యక్రమం. నాస్తికత్వంలో ప్రజాక్షేమకరమగు ఆశయం స్పష్టంగా ఉంటుంది. నిరీశ్వరవాదంలో ఎదటివారి లోపములను చూపించుట, విమర్శనా దృష్టి అధికంగా ఉంటుంది. నిరీశ్వరవాదానికి ప్రతికూలత హెచ్చు. నాస్తికత్వానికి ప్రజాదరణ హెచ్చు.

## సమస్యల పరిష్కారం

ఏ సమస్య అయినా తీసుకుని దానిని పరిష్కరించబోయేసరికి చాలా చిక్కులు అడ్డువస్తున్నాయంటారు. ఇట్లు చిక్కులు రావడం ఏ కొన్ని సమస్యలకో కాదు. చిన్నదైనా సరే, పెద్దదైనా సరే, ఏ సమస్య తీసుకున్నా ఇలా చిక్కులు, అడ్డులు వస్తూ ఉంటాయి. అయితే వీటిని పరిష్కరించడం ఎలాగ?

అస్పృశ్యత సమస్య తీసుకుందాం. ఇతర సమస్యలతో సంబంధం లేకుండా అస్పృశ్యత మట్టుకు అస్పృశ్యత పోవడానికి అక్షేపణ చాలా తక్కువగా ఉంటుంది. కాని అది అలా జరగదు. అస్పృశ్యత పోగానే హరిజనులలో ఆత్మగౌరవం పెరుగుతుంది. వెంటనే వారు ఇతర విషయాల్లో కూడా సమానతను కోరుతారు. అనగా ఇంతవరకు సహించిఉన్న దారిద్ర్యాన్ని ఇకమీద ఒప్పుకోరు. అలాగే అన్ని విషయాల్లోను సమాన ప్రతిపత్తి కోరుతారు, ఇట్లు ఆర్థిక విషయాల్లో కూడా మార్పు కోరడం

ఇతరులకు ఇష్టం ఉండదు. ఒక సమస్య ఇంకో సమస్యలోకి తీసుకు వెళుతుంది కనుక, అసలు అస్పృశ్యతా సమస్యనే తీసుకోకుండా అడ్డు పడతారు.

అందుచేత ఏ ఒక్క సమస్యను తీసుకున్నా దానితో ఆ సమస్య ఆగిపోతుందనుకోవడం పొరపాటు. ఆ సమస్య వెనువెంటనే ఇతర సమస్యలు ఎన్నో వస్తాయి. వాటి నన్నింటిని కూడా ఒకదాని వెంట ఒకటి తీసుకోడానికి సిద్ధంగా ఉండాలి. ఈ సంసిద్ధత లేకపోయినట్టే సమస్యలను తీసుకునేవారు, కొత్త సమస్య రాగానే వెనక్కి పోతూ ఉంటారు. దాని వల్ల అసలు సమస్యా పరిష్కారానికి అపచారం కలుగుతుంది.

నాస్తికుడు వాస్తవికతను గుర్తిస్తాడు తాను తీసుకున్న సమస్యల వెనువెంట వచ్చే ఇతర సమస్యలను కూడా పరిష్కరిస్తాడు. నాస్తికుని మనస్సు ఏ విషయంలోనూ కూడా దురభిమానాలచేత ముడుచుకుని ఉండదు. అందుచేత ఎన్ని సమస్యలువచ్చినా సరే తనకు కొత్తదన పిరికితనం, వెనుదీయడం ఉండదు. ఒకదాని వెంట ఒకటి పరిష్కరిం కుంటూ వెళతాం

— ● —

NENU NASTIKUNNI By GORA Rs. 2-50

# గోరా పుస్తకాలు

| | |
|---|---|
| POSITIVE ATHEISM | 5.00 |
| WE BECOME ATHEISTS | 5-00 |
| AN ATHEIST WITH GANDHI | 1-25 |
| దేవుని పుట్టుపూర్వోత్తరాలు | 1-00 |
| ప్రజాస్వామ్యం పెరగాలంటే నాస్తికత్వం కావాలి | 1-00 |
| సృష్టి రహస్యం | 2-00 |
| నేను నాస్తికుణ్ణి | 2-50 |
| నాస్తికత్వం | 4-00 |
| సంకల్పాంజలి (గోరాకు శ్రద్ధాంజలి) | 1-00 |

## త్వరలో రానున్నవి

| | |
|---|---|
| మూఢ నమ్మకాలు - నాస్తిక దృష్టి | గోరా |
| నాస్తికురాలిగా నా జీవితం | సరస్వతీ గోరా |
| నాస్తికత్వం - నేను | లవణం |
| I LEARN | GORA |


నాస్తిక కేంద్రం

పటమట :: విజయవాడ - 520 006